యుగచరిత్రలు నేత్రయుగళి నిల్పకముందె
చుక్కలు లెక్కించి చూచినావు
ఖండముల్ పసిలేతకంఠ మెత్తకముందె
సామగానము చేయ సాగినావు
కావ్యసత్కృతులు లంగాలు దాల్పకముందె
సృష్టికి సొంపు గైసేసినావు
ఓషధుల్ పుడమిపై నుద్భవించకముందె
వైద్యశాస్త్రమ్మును పలికినావు
ఓ యనంతపురాతనయోగవాణి !
నాఁడు నేఁడును నేనాఁడు వాడిపోని
నీదువిజ్ఞానసురభిళనిచయమునకు
భక్తిపూర్వకనమస్సు మోడ్తునమ్మ.

ఏ తల్లిరక్తవాహిని వేఁడికదలిక
పలుకు ప్వారులాలుపండితుండో
ఏ మాతృచైతన్యహృదయనాదములోని
జవము రాజేంద్రప్రసాదఘనుఁడో
ఏ మహాజనని శ్వాసించు స్వేచ్ఛావాయు
నాళమ్ము మా రంగనాయకుండో

ఏ వీరమాత మోయున్ వజ్రకవచమ్ము
వల్లభాయిపటేలువల్లభుండొ
ఏ మహామానసనిశితబుద్ధీంద్రియమ్ము
ఘనుఁడు రాజాజి యగునొ, యే కన్నతల్లి
యాత్మకు మహాత్ముఁ డగునొ మహాత్మ, యామె
మాన్యసద్గుణ హైందవమాతృమూర్తి.

సకలసద్గుణభూమి సాధుపుంగవుఁడు రా
మస్వామిరెడ్డి నీ మస్తకమ్ము
రాజకీయయుగంధరస్వామి మా కళా
వేంకటరావు నీ విమలమేధ
గురుఁడు మా ఆంధ్రకేసరి పరిత్యక్తభో
గుఁడు టంగుటూరి నీ గుండెకాయ
కలము కత్తికిఁ జాల బలముగూర్చెడు యోధ
గోపాలరెడ్డి నీ కుడిభుజమ్ము
మా తెలుంగుకులజ్యోతి మలఁగనీని
భోగరాణ్మణి నీ మణీముకుటరత్న
మాంధ్రజనయిత్రి! నీకు జోహారులమ్మ!
ధాత్రిలోపలఁ గళ్యాణధాత్రి వీవు.

# కిరణ సమీక్ష

"చంద్రగిరిదుర్గము" ను గూర్చిన చారిత్రాత్మకమైన విషయమును నామిత్రులు ప్రౌఢకవి మిన్నికంటి లక్ష్మయ్యగారు పద్యరూపమున సిద్ధాంతమైన తెలుగుజాతి శౌర్యమును సజీవింపజేయగల సమర్థతతో దీర్చి రసవత్తరకావ్యము ను సృజించి భాషాప్రియులు రసికులునగు నామిత్రులు శ్రీ మద్దాల రామకృష్ణమ్మగారికి కృతి నొసంగియుండుట మిక్కిలి యానందము.

ప్రౌఢకవి లక్ష్మయ్యగారికి నాకున్న సమీపమగు ప్రేమ గౌరవము కలదు. సాహిత్యసభల యందు అనేకపర్యాయములు కలసికొనుటయు, పాల్గొనుటయు, గలదుగాన చనవుకూడ నేర్పడినది.

ఈ చనవునే ప్రధానముగ గైకొని ఈ "చంద్రగిరి దుర్గ" మహాకావ్యమునకు నన్ను పీఠిక వ్రాయవలసినదిగా ప్రేరేపించిరి.

నేనందులకు సమర్థుడను గానని తెలిసియు, కృతికర్త కృతిభర్త నాకు పరమమిత్రులగుటం జేసి, వారియాజ్ఞను శిరసా వహింపక తప్పినదికాదు.

శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు తణుకు బోర్డు హై స్కూలులో తెలుగుపండితులుగా పనిచేయుచు భాషాసేవచేయు చున్నవారు. వారికే కొంచెము నవకాశములభించినను స్వతంత్ర భావములు స్ఫురింపజేయుగల వీరులచరిత్రవైపునకే తమదృష్టిని మఱలించి వానిని సమీకరించి ప్రతిభతో నుత్తమకావ్యములను సృజించుటే పరమావధిగా బెట్టికొన్నారు. ప్రతిభావిలసితము లైన కొన్ని స్వతంత్ర గ్రంథములనుగూడ వ్రాసి పాఠకలోక మునకెంతేని అభిరుచి కలిగించి యున్నారు.

చంద్రగిరిదుర్గముయొక్క చరిత్ర మన తిరుపతిసమీపమున గల తిరుపతికొండలకు చేరియున్న చంద్రగిరికి సంబంధించినది. సుప్రసిద్ధ మైనదియు; అగుటచే నేనావిషయమై యేమియు వ్రాయ బూనుకొనలేదు. కాని కావ్యము పరిస్తృతమునకు, వీరు లుద్భవించుట కనువగు సామగ్రిని కలిగియుండుటచే శ్రీ లక్ష్మయ్యకవిగారు సుచితరీతిని వారి దేశాభిమానమును గూడ సరీతిగా జూపి రనవచ్చును.

ఈ కావ్యము వచనరూపములోకన్న పద్యరూపములో వ్రాయుటవలన కవిత్వములో నున్న మాధుర్యమును వెల్ల డింపు శక్తి, ప్రోత్తేజనము యావనము తిరిగి సృష్టింప గలశక్తి పద్యమునకేగలదు కావున నాకిది ఇష్టమని నాకు తెలిసినదే. ఈగ్రంథము విద్వజ్జనప్రశంసనీయముగ నుండు నట్లు రచియింపబడుటచే కవిగారు ప్రశంసాపాత్రులు. ఇట్టి

సద్గ్రంథమును గృతినందుకొనుటలో శ్రీయుతులు మద్దాల రామకృష్ణమ్మగారి భాషాసేవ, దేశసేవ వెల్లడియగుచున్నది.

కావ్యము నలుమూలల నెచ్చట నేభాగమును పఠించి నను నిర్దుష్టమగుభాష, మృదుమధురమగుశైలి, సరళమైన పద్యగమనిక గలిగి రసముట్టిపడుచు సలక్షణముగ నుండెననుట కెంతమాత్రము సంశయింప నక్కరలేదు. అటనట దీర్ఘసమా సములు రససన్నివేశముల కనుగుణముగ దొరలియున్నవి. ఆ విషయములో నేమాత్రము మార్పు తీసికొనివచ్చినను గావ్యము నకు గొఱతయే యనుకొందును. పలుచని భావములను దీర్చు శబ్దము మృదువుగా సుఖముగా నుండును. లోతైన భావములను దీర్చుశబ్దము నిగ్గదేరి భాషలో నశక్తిని వెల్లడించి పరిచయా ధిక కావ్యస్వాస్థ్యమందు సుఖముకన్న నొక మెట్టుపైనుండెడి యానందమును సమకూర్చును.

శ్రీ లక్ష్మయ్యకవిగారి కావ్యము జిగియు ప్రౌఢియు ధారాశుద్ధియు గలిగి వలసినచోట్ల ప్రౌఢమై మృదుసన్నివేశ ములతో సుకుమారమై రసవత్తరముగనున్నది. రసవత్తరమైన రచన పూర్వజన్మనుండి తెచ్చుకొనవలయునేగాని ప్రయత్నము వలన గలుగదు.

తిరుమలరాయల దేశవిచ్యుతి, [illegible]; రంగరాయల రాజ్యతిరస్కృతి; రాణి యెత్తుపై యెత్తులు; మణిభట్టు రాయ

చారము; రణమల్లు పతనము; రంగరాయల వధ; ముఖ్యముగ నీ కావ్యములో దొణికిసలాడు రసనదులు.

ఈకావ్యమున ఆస్తిక్య నాస్తిక్యములకుఁ బోరాటము కల్పింపబడి యాస్తిక్య ప్రాబల్యము దానినాశనము వైదికార్ష మతముయొక్క దిగ్విజయము రమ్యముగ దీర్చబడినవి. ఇందు యాచమనాయుడు —రాణి అసాధారణవ్యక్తులు. రాజ కుటుంబమునకై యాచమనాయుడు, స్వార్థమునకై రాణి పోరుసల్పిరి.

మహాచక్రవర్తియైన రఘునాథరాయల సహాయముతో యాచమునకు మహావిజయము లభించినది.

ఎట్టివారికిగూడ రణమల్లు పతనములో రంగరాయల వధవిషయములో నాడెలు జలదరింపకపోదు. చరిత్ర యొక్క సూక్ష్మాంశములనుబట్టి వలసినచోట పెంచుచు కావ్యమును రసవత్తరముగ తీర్చి యాంధ్రలోకమున కొసంగిన శ్రీకవిగారికి నా ధన్యవాదములు.

కవిగారికి శ్రీ ముద్దాల రామకృష్ణమ్మ గారివంటి కృతి భర్త లభించుటచే వారి కావ్యకన్య ధన్యురాలు. ఆయన విద్యాలభోజుడు. నివురుగప్పిన నిప్పువంటివాడు. భాషాభిమాని. స్వగ్రామమైన వీరవాసరమందే హైస్కూలుభవనమును పెద్ద మొత్తమును వెచ్చించి కట్టి దానమొసంగిన సాహసశాలి.

ఆయనను గురించి కృతిపద్యములలో కవిగారు వ్రాసినదానిలో అతిశయోక్తి యెంతమాత్రములేదు. ఇట్టి ఉదారస్వభావులగు నా మిత్రులు శ్రీయుతులు మద్దాల రామకృష్ణమ్మగారికి కవి గారికి పరమేశ్వరుడు సకలసంపదలనిచ్చి కాపాడుగాక.

ఇట్టి పవిత్రమైన కృతికన్యను జేపట్టిన శ్రీమద్దాల రామకృష్ణమ్మ గారివంటి కవిపండితపక్షపాతులు మన యాంధ్రదేశమున ననేకు లుద్భవింతురుగాక.

ఇట్లు,

"కవికులాలంకార"

"వాఙ్మయోద్ధారక"

జవ్వాది లక్ష్మయ్య.

# చంద్రగిరి దుర్గము

## కృతిసమర్పణము

శ్రీ మదిందిరామలయమారుతమహల్ప్రవేశ
మహోత్సవ శుభవేళ.

శ్రీమద్దిగ్విజయీ జయీభవ జయశ్రీరావముల్ దివ్య ల
క్ష్మీమంజీరమృదుస్వరమ్ములటు వాగ్దేవీ కరామృష్ట వీ
ణామంజుధ్వను లట్టు బాలికల కంఠాగ్రమ్ములందుండి క
ర్ణామోదమ్ముగ వచ్చుచుండ దసరా రాణించు రమ్యాకృతిన్

ప్రీతిగ సుగంధవస్త్రా
పేతము బుక్కాయి పిల్లవిలుకాండ్రు మహా
శ్వేతలవలె దాతలపైఁ
దాతలపై గుప్పుచుండ్రి దరహాసముగన్.

ఆ కల్యాణవిచిత్రధన్యులు నిజాస్యాలంకృతిస్మేర ల
క్ష్మీకుల్ చిన్నివటుల్ మదంగణమునన్ జేపెట్టువేళన్ గృపా
సేకమ్మై యొక లేఖ రేఖవలె వచ్చెన్ భావి మత్కావ్య క
న్యాకల్యాణముహూర్తరేఖకు నమందానందసుశ్రీకమై.

లేఖఁజూచి నయన రేఖకునద్ది మ
ద్దాలరామకృష్ణధారుణీంద్రుఁ
డేల తక్షణమ్ము రేలూరు నన్ను ర
మ్మని లిఖించె నంచు నాత్మఁ దలఁచి

భక్తితోలఁదిఁ జిన్నివటువులఁ బూజించి
వెడలినాఁడ నాఁడు విజయదశమి
శుభముపైని శుభము సూచించుశకునమ్ము
లెదురుపడియెఁ గాలు కదుపుటాది.

అమృతంపుసోనలే యతనివాగ్ఝరులలోఁ
లలితప్రపలు పెక్కు నిలిపినవఁట
యానందరాసులే యతనికన్నుదలలోఁ
గళలకు సదనముల్ గట్టినవఁట
యతిసత్యసుమములే యతని సన్నిధిలోన
ఫలరసాస్వాదముల్ పడసినవఁట
యమరగానమ్ములే యతనికీర్తనలోనఁ
గనకాభిషేకమ్ముల్ గాంచినవఁట
ధన్యమూర్ధన్యుఁ డతఁడు మద్దాలజేఁడు
ధర్మరక్షణ కాతఁ డద్దాలమేడ
యనుచు జనులాడుకొనునుడుల్ వినుచు నేను
విభుని దర్శించుకొంటిని విజయదశమి.

స్వర్ణచ్ఛాయ లెసంగు గద్దెపయిఁ గృష్ణాగౌతమీమిశ్ర కు
ల్యార్ణఃపూరపవిత్రతమ్మయిన హేలాపట్టణమ్మందు సం
పూర్ణశ్రీ తులకింప నా విజయభవ్యోదారసద్వేళ మో
దార్ణోరాశిగ రామకృష్ణవిభుఁ డధ్యాసించియుండెన్ దమిన్.

కలశాంబునిధి కన్యకా మనోహరనాట్య
        శాల యే మహనీయుచంద్రశాల
విశ్వదానక్రియా వివశానుభూతి నై
        భవ మే మహాత్ముసంపత్ప్రవృత్తి
శ్రీరామకృష్ణసేవారమ్యచిహ్నిత్త
        నామ మే సుశ్లోకునామగరిమ
సుకవిరాట్పండితప్రకటోరుసత్క్రియా
        నిబిడ మే సత్కళానిధిమనస్సు
తెల్గునాయకజాతిప్రతిష్ఠ యెదిగె
నెవనిజనిచేత నుతికెక్కె నెవని వలచి
ప్రథితమద్దాలవంశ, మా రామకృష్ణ
విభుఁడు పూజార్హుఁ డఖిలాంధ్రపీఠమునకు.

అని నామతిలో నేమో
తనుఁగూర్చి తలంచువేళ దరహాససుధా
ఝణికితవీక్షణచాంద్రీ
మణు లుపహారములు పెట్టి మర్యాదలతో.

గౌరవ మింత యున్న కవిగారికి మాపయి, వ్రాసివంత నే
లూరికి వచ్చినారు, మఱి యూరక తోఁపక ప్రొద్దుపోక, నో
రూరఁగ మీకృతుల్ చదువుచుండి మిముం బిలిపింపనయ్యెఁ జా
చేరునా యాప్యకద్విశతి చిన్నిబహూకృతి నొచ్చుకోకుఁడీ!

బంగారుబగ్గి నీ ముంగిట నిల్వదా
        యానాఁడె తంజాపురీశుఁ డున్న
నేన్గుటంబారు నీ యింటిముం దుండదా
        నేఁడె శ్రీకృష్ణరాణ్ణృపతి యున్నఁ
బగటిదివ్వియ నీకుఁ బట్టరా కదలుచోఁ
        బ్రౌఢరాయలె నేఁడు బ్రతికియున్న
మొలను బచ్చలబాకు వెలయదా యోరుగల్
        సింగమే యీరోజు చెలఁగియున్న
నాంధ్రగీర్వాణకవితామహాసుధాబ్ధి
మథనమంథానగిరి వౌట మాత్రె కాక
మ్రింగితివి వెన్న రసభావమిళిత, మైన
నొకయుపాధ్యాయపదమె నేఁ డొసఁగె నీకు.

అనినంతన హృదయము జ
ల్లన నిట్లంటి తమ రాడినది కాదన నే
ర్తునె రఘునాధనృపతి కృ
ష్ణనృపతి ప్రౌఢనృపతియును నా కీ రగుటన్.

అడుగువారలకు లేదనక చేతికి వచ్చి
        నంత నిత్యమ్మిచ్చుటరయనో కో-
అపరంజికళ్ళజో డడుగక తెప్పించి
        నా కిచ్చుటది మదిన్ దలఁచుకొనవో
ప్రతిసంస్థ కపరంజినాణగాఁ జందాలు
        గురియుచుండుట నాకు గుర్తులేదో
స్వగ్రామనిత్యోత్సవమ్ము లేటేటఁ బె
        క్కులు మీఱె మోయుట తెలియనో కో-
హరికథాదాసునకు మొన్న మైదునూర్ల
బిఱుదుకంకణ మిడుట నే నెఱుఁగనో కో-
నాకు నిన్ననె రెండువందల నయాంచి
తమునఁ బంపుట కాదో ప్రత్యక్షము ప్రభు !

వీరవాసరపాఠశాలారమణికి
విమలభవనమ్ము నిరువదివేలు పెట్టి
కట్టియీయరె యెన్నగా నిట్టివెన్నొ
కలవు మూయంగఁగలరె జగమ్ముకన్ను.

అని నేననుఁడున్ విభుఁడో
య్యన నగి మీ కవుల కున్నదదె యున్నది లే
దనకయె పొగడుదు రొక మి
మ్మనఁగవలదు గాని యంచు నవె మఱి యిటులన్.

మీ రాక రాకవలెఁ గా
వ్యైరితకమనీయదిగ్జయాకృతకీర్తి
శ్రీరాకగ మా కెంచెద
మీ రాక ఫలింపఁజేయుమీ ప్రౌఢకవీ!

చంద్రగిరిదుర్గలక్ష్మికని
సాంద్రశరచ్చంద్రకీర్తిజయలక్ష్మికని ని
స్తంద్రప్రీతి నొసంగుఁ డీ
లేంద్రపద మ్మిచ్చినట్టు లెంచెద మెంతో.

ఇది విజయదశమి శుభసం
పద కాస్పదము మున్ను పార్థుఁడు జయసం
పదఁ గొనినట్టిది తీర్చుఁడు
పదనగు మీ కలము నెత్తి భవ్యముగఁ గృతిన్.

అని ననుఁ దట్టునంతట ముదబ్ధికిఁ గట్టలు లేనియట్లు నా
యనుపమసత్కళావని కనంతవసంతము దోఁచినట్లు నా
కనులకుముందు మేరునగకాంతులు దొంతరగట్టినట్లు నేఁ
దనియుచుఁ బల్లవించుచుఁ గృతజ్ఞతఁజూపుచు నుల్లసిల్లుచున్.

కొనుఁగాక కృతులన్ని గుత్తగా సుకవిహృ
　　త్కృతి పిండఁగలుగు పృథ్వీశుఁ డున్నె
యిడుగాక బిఱుదు లెన్నేని తజ్జీవనో
　　పాధిఁ గల్పించు భూపాలుఁ డున్నె

కావ్యమ్ములెల్ల నాజ్ఞాపించుఁగాక త
  త్ప్రసవవేదన కన్న పతి గలండె
కృతులు వేలకువేలు శ్రుతియొగ్గి వినుఁగాక
  విలువతో రస మాను విభుఁడు గలఁడె
నూటికొక్కరో లేకున్నఁ గోటికొకరో
వినుతగుణు లిట్టి సత్కళావిభుఁలు తక్క-
నన్నిట రసజ్ఞులై కీర్తిఁ గన్నవారు
కన్నవారె కా దాస్థఁ గొన్నవారు.

నా దుర్గలక్ష్మి కీ విభుఁ
డాదేయుం డఖిలసుగుణుఁ డమృతహృదయుఁ డా
మోదరసాభిష్యంద
శ్రీఁ దగ నభిషిక్తు నీవిఁ జేసెద ననుచున్.

ఈ తెల్గునాఁడు పాలించిన రఘునాథ
  రాయండు నీ జాతి రక్తకణము
ఈ తెనుంగుజగత్తు నేలిన నాగమ
  నాయండు నీ శాఖనవ్యసుమము
ఈ యాంధ్రసామ్రాజ్య మేల్బడిగొన్న భీ
  మనయోధ నీ పాయమనినవాఁడు
ఈ త్రిలింగోర్వి రక్షించిన విశ్వనా
  థవిభుండు నీ యింటితాతగారు

రాచమర్యాద వంశమర్యాద నీది
కులముధర్మము కృతులను గుత్తగొనుట
నాఁడు నేఁడును మద్రాలరేఁడ! నీకు
ననుగుణమ్ముగ వెడలె నైజాభిలాష.

కలసియున్నది దేశకళ్యాణయత్నర
క్తములోన నీ చేతిదానలహరి
వెలసియున్నది జగద్విజయనాదములోన
నీ దానకంకణనిస్వనమ్ము
ఎసఁగియున్నది లోకహితకళాజ్యోతిలో
నీ దయానయనప్రసాదకాంతి
పండియున్నది జగత్స్వాతంత్ర్యలతికపై
నీ యఖండ వదాన్యతా యశస్సు
నా కృతికి నీవు భర్తృతానంద మిడుట
కంటె భాగ్యమ్ము వేఱున్నె కనకదామ
మునకు నాయకమణి లభించినది నేఁడు
అమలగుణసాంద్ర! రామకృష్ణావనీంద్ర!

కల్యాణకళిక మత్కావ్యకన్యకు భర్త
చెలఁగుదు నానందసేతు వెక్కి
ముత్యాలకోవ నా ముద్దుపట్టికి రాజు
పొంగింతు మన్మదంభోధి బుగ్గ

చేతనాసుమలత నేత నా కృతికి నిం
కలరింతు షోడశకళలగు_త్తి
దేహమె_త్తిన కళాదీ_ప్తియే మత్కావ్య
రమణికిఁ బతి జయరావ మిదుదు
అమృతహ_స్తము నె_త్తి జయాశిషమ్ముఁ
బోసి స్వకళాప్రపూర్ణత్వ ముపదఁ జేసి
కృతిఁ గొనఁగ మాటయిచ్చె నీ వితతపుణ్యుఁ
డింత కన్నను బుడమి నా కేమి వలయు.

అని నామదిలో గుబగుబ
మని పొంగులువాఱు తీయనౌ తలఁపులలో
మునిఁగి యొకించుకతడ, వి
ట్లని మనవి యొనర్చుకొంటి నా విభు మఱియున్.

నీ చేతిలో యశోనిక్షేప మున్నదో
నిధి యున్నదో పేద నెగడు సిరుల
నీ వాక్కులోఁ గళానిధి నిల్చెనో కావ్య
సుధ నిల్చెనో వెల్గు బుధుఁడు కృతుల
నీ కంటిలో స్వర్మణిచ్ఛట యున్నదో
యమృత మున్నదో లోక మలరు మిగుల
నీ మూ_ర్తిలో ధర్మకామ మున్నదో కృపా
ధామ మున్నదొ నిన్నె ధాత్రి వలచు

కవిశిరోధార్యమయ్యా నీ భువనసేవ
కృతి కురోహార్యమయ్యా నీ కీర్తిరేఖ
రామకృష్ణావనీంద్ర ! యాంధ్రమున ముందు
అగ్రపూజకుఁ గలవయ్యా హక్కు నీకు.

ఎవరయ్యా ! యొకే పాఠశాలకయి
యెంతే ముద్దుబిడ్డన్ వలెన్
బవలున్ రేయి గడించి పెంచిన మహా
భాగ్యమ్ము నీ మాదిరిన్
భవనమ్మిచ్చి వ్యయించి దిగ్విలసి
తప్రాలేయరుక్తారకా
నవనీహారపటీరహారహారమం
దారాభ కీర్తిన్ గొనెన్.

తీయని నీ మనస్సు కలితీ కనుపింపని వెన్నపూస మే
ల్సేయు భవద్గుణమ్ము నకిలీ వినిపింపని పైడిముద్ద స
ద్గేయము నీ చరిత్ర మలికీ యనరాని సజీవసౌధ మో
ధీయుత రామకృష్ణజగతీధవ నా కృతికన్య ధన్య సూ.

గుత్తులు గుత్తులై కళలగుత్తులు నీ దగు పైడిగద్దె సం
పత్తులపై ఫలించినవి త్వద్ఘనదానమహాబ్ధిధాటి కో
క్కెత్తున పంపుగొన్నవి మహీంద్రశిరస్సులు రామకృష్ణభూ
భృత్తిలకా ! కృతీందిరయదృష్టము పండెఁగదా భవత్కృపన్.

కమ్మని నీ నుడిన్ వఱదగట్టెడి కామగవీగుణమ్ము, లో
కమ్మున విజ్ఞవీగు శిబికర్ణ దధీచివదాన్యతా రుచిన్
వమ్మొనరించు నీ బిఱుదు, వాస్తవ మింత తలంప రామకృ
ష్ణమ్మదొరా ! రసప్రసరమై తనరారెడి నా శరీరమున్.

నీ కమనీయమూర్తిని జనించెడుఁ జూచిన జన్మజన్మ పూ
జాకృతపుణ్యలబ్ధి నరజన్మకు మీరిన దైవతాంశ మీ
వాకున వాఁకమై తెలుఁగువారియశశ్శరదిందు రేఖమై
దూకులు వెట్టెడిన్ భువనఘూర్ణసూచాతురి కండ్లఁగట్టెడిన్.

నీ సుకృతమ్ములో నిధులు లెచ్చెను లోకమహోపకార దీ
క్షాసముదారవైఖరిని జాటుచు, నెగడు కీర్తిసౌరభ
స్థాసక మాంధ్రవీరవనితాజనతాలవలీకపోల వి
న్యాసకమై కళాస్థగితమైనది నా కృతికన్యభాగ్యతన్.

అది నవనైజసుందరవిహారము నీది యగాధమైన నీ
హృదయ మహాసుధాహ్రదవరిష్ఠమునుండి గరిష్ఠ సత్కృపా
నదులు దరిద్రజాంగలగణమ్ములపైఁ బ్రవహించి సంపదా
స్పదములొనర్చు నీ దృగను భావలెందతికుండు సత్ప్రభూ !

నీ మధురస్మితద్యుతిని నిల్పి నటించెడి శారదామణి
స్థేమకిరీటరత్నరుచి, చిందెడిఁ దత్కమనీయగాత్రి తం
త్రీ మహనీయగానసుధ నీ నుడిఁ, దత్కలహంస పక్ష గం
ధామల వాయువే విసరు నాపయి నీ మృదుసన్నిధిన్ బ్రభూ !

కృతి యెప్పుడు గైకొందురో
మతివెట్టుఁడు దానధర్మ మహనీయ యశో
వృత సకలార్ణవ వేలా
వృత నిఖిలోర్వీక! సురగవీశ్రీక! యనన్.

మందహాసమందు మాధుర్య మింపొంది
క్రిందిపెదవినుండి చిందుచుండ
మత్కృతీశ్వరుండు మద్దాలశ్రీరామ
కృష్ణరాయమహితుఁ డిట్టు లనియె.

చాల ముదంబుధిన్ మెలఁగఁజాలితి మీ దశమీజయోత్సవ
శ్రీలలితమ్ముగాఁ గృతిని జేకొనఁజెల్లును గాని నే జగ
న్మ్రాలగ నిందిరామలయమారుతసౌధము గట్టుటయ్యెఁ ద
ద్వేళ మహాప్రవేశమున స్వీకృతిఁ జేసెద మీ కృతీందిరన్.

అందనుక సహింపుఁ డిందిరామలయమా
రుతమహల్ జిగాజిలుంగు దొడుగు
మురువుతోడఁ జంద్రగిరిదుర్గ మపు డేలు
కొందు మిందుకీర్తిఁ గొందు ముర్వి.

ఆ మాట నాహృదంతర
సీమాటవి కమృతరసము చిలికెడి యూఱై
కామారిజటాలహరీ
సోమకళల తేటయై రసోల్బణ మిడఁగన్.

సౌఖ్యము నీదుసాత్త్వికమృతరాశికిఁ దీయఁదనమ్ముఁబోయు నీ
జోక్యము నీ వలెన్ హృదయసూనము నొవ్వక మెత్తమెత్తగా
శక్యమె రాజనీతిరథచక్రములన్ నడుపంగ నాఁటి చా
ణక్యునకైనఁ దిక్కనకునైనను దిమ్మరుసయ్యకేనియున్.

పొంగినపాలపైఁ దళుకుఁబోలిన తెల్లనికీర్తి సాహితీ
రంగమునన్ గడించితివి రాజులు గీజులు రాజశేవి నీ
చెంగట నేర్చుకో వలయుఁ జెల్లదు పో మఱి యేరికిన్ దయా
పాంగమునందు నీ వలె సహస్రము గుప్పఁగ గుప్తదానముల్.

ప్రాయము నూఁగుమీసములపై నలుపద్దనినాఁడె దిద్దె నీ
చేయి యశోంగనానిటలసీమఁ గళాతిలకమ్ముఁ నీకుఁ బై
చే యొక టున్నదా కృతులుచేకొను-చోటున నీకుఖుద్దునన్
రాయల నెన్నకున్న రఘునాధుని మన్నన నల్పకున్నెడన్.

పాయసభాండమో యమృతభాండమొ నీహృదయమ్ము కావలెన్
గాయలు కాచె నీ కర మఖండముగాఁ దయచేసి దానముల్
పాయదు దానలక్ష్మి మఱి పైఁబడి తేపునుమాపు నీ స్మిత
చ్ఛాయల నిల్చి నీదు మొగసాలను వేయును వేయి విస్తళుల్.

రాజులు చిన్నవోయిరి నిరంతర మీ వొనరించు సాహితీ
పూజకు నాంధ్రజాతి కొక భోజుఁడు నేఁటికిఁ గల్గెనంచు, రా
రాజనమందసాంద్రమకరందకళాధుని గుప్పినట్టి రా
రాజగు కృష్ణరాయలు కళావని నీవుగఁ బుట్టె నంచునున్.

మతి నేను ముఖస్తుతిఁ జే
సితి ననకుఁడు నిక్క మిద్ది శ్రీమద్దాలేం
ద్రతిలక! యని తత్సుబహూ
కృతులను గాని నాఁటి కింటి కేగితి నేనున్

ఆనాఁటి శుభముహూర్తమె
యీ నాఁటికి నా కృతీశ్వరీరితకల్యా
ణానంద రేఖ కయ్యెను
పాణిగ్రహణమ్మునన్ శుభమ్ముగ నెసఁగెన్.

లలితమహా నిందిరామలయమారుతమహల్
జిలుఁగుకాంతులతోడఁ బులకరించె
బంగారుచీడీలఁ బసుపుఁగుంకుమ రేఖ
లలరి నాజూకులు చిలుకరించె
మవ్వమా పలురంగురవ్వలపింగాణి
కుట్టిమమ్ముల సొంపు లుట్టిపడియెఁ
దళుకారుపాలగచ్చుల నిగారింపులు
మసృణకుడ్యాలపై మలసియాడెఁ
బట్టుసోఫాల ఠీవియుఁ బచ్చతోర
ణముల గల్యాణరేఖయు నాట్యమాడె
జిలుఁగుటద్దాలతలుపులు సిగపతాక
ఘనముఖద్వార మొక శిల్పకళగ నెసఁగె.

పలురంగుసగిషీలవిలసిల్లి వేంగి దే
　　　శాధీశు సాహితీసదన మనఁగ
ప్రథితకళావేత్త ప్రౌఢరాయల సుధీ
　　　శాలయా ముత్యాలశాల యనఁగ
జీవసత్కళల రంజిలి కృష్ణరాయల
　　　భువనదిగ్విజయసభాభవన మనఁగ
రమణీయమైనట్టి రఘునాథరాయల
　　　మహితసరస్వతీమహ లనంగ
సుకవి పండిత నటక గాయక యుతమ్ము
హితపురోహితబంధుసమేత మగుచుఁ
బ్రజల కొక తీర్థమై నేత్రపర్వ మగుచు
మలయమారుతమహాలు మేల్జిలుఁగు దాల్చె.

వేదగానధ్వనుల్ విశ్వజననీకంఠ
　　　మంగళాశీస్సులై పొంగువాఱ
కవుల యమోఘవాక్యములకు వశపడి
　　　కలుములు వఱదలు గట్టుచుండ
బాంధవహితకోటిబంగారుదీవనల్
　　　గుబగుబ జల్లులై గురియుచుండ
వృద్ధపుణ్యాంగనావితతియాశీస్తతుల్
　　　లలితవాద్యధ్వనుల్ చెలఁగుచుండ

మంగళస్నాతుఁడై దివ్యమాల్యవస్త్ర
సముచితాలంకృతిశ్రీప్రసన్నుఁ డగుచు
రమణ మద్దాలరామకృష్ణమవిభుండు
మహలు నటు సొచ్చి యిటు కృతిమహిళ నేలె.

మహాలా బహుసౌఖ్యా
వహాలావణ్యవతి యువతి కృతిమహిళా
బహులాభయశశ్శ్రీధన
లహరీచంద్రగిరిదుర్గరాజ్యరమ యగున్.

అభిషేకించితి నాదుచంద్రగిరి
        రాజ్యశ్రీని యుష్మన్మహో
శుభశుండాసమబాహుదండమున
        భాషోదగ్రవిద్వత్కళా
సభలో నిస్తులసాహితీమధుర
        పూజారమ్యపాణిన్ భవ
త్ప్రభులక్ష్మీపరికల్ప్యమాణవిల
        సద్దానాంబుధారామహో
విభవమ్ముల్ గొని రామకృష్ణవిభు
        లోర్వీనాథ! రాణింపుమీ!
ధరియింపంగదవయ్య నీ ముకుట
        మూర్ధాగ్రమ్ము కుంచించి మ

ద్గురుగంభీరకళాక్షతల్ కలుగు
నీకున్ రామకృష్ణప్రభూ!
ధర వర్ధిల్లెడుదన్క వాఙ్మయ
చరిత్రన్ దొల్లి తంజాపురిన్
బరిపాలించిన నీ కులప్రభుల
శశ్వత్కీర్తి సుస్థాయిగన్.

అని మధురాశిష మ్మిడి దయాపరిద త్తతదీయసత్కృతుల్
కనకమయాంబరాదులను గైకొని తత్సభలోన నమ్మహా
త్ముని కరమందుఁ జంద్రగిరిదుర్గకృతీందిర నర్పణమ్ము వె
ట్టిన సుకృతమ్ముఁ గంటిని గడింతిగఁ గొంటిని నిత్యసంపదల్.

ఇది మదీయచిత్త మిగురొత్తు తఱియౌట
కృతము దలఁచి లోని కుతుక మరసి
దిక్ప్రదర్శనముగఁ దెలిపెద మత్కృతీ
శ్వరు ననంత వంశచరితఁ గొంత.

శ్రీమద్దానదయాభిరామనరలక్ష్మీధామమై, ధామమై
భూమీయోషకు వీరవాసరము పొల్పుం బూర్వ నందున్ వెలం
గామాంధాతలు కొంద ఱుందు రురుముక్తాదివ్యరత్నమ్ములై
శ్రీమద్దాలపవిత్రవంశమణివార్ధిప్రోద్భవస్ఫీతులై.
వారల నాయకమణిగా
వీరుఁడు వేంకనవిభుండు వెలసె యశఃకాం

తారత్న: మవనిపై నిజకాం
తారత్నము భవనసీమఁ దావులు చిమ్మన్.
ప్రీతిగ వానికిఁ గలిగిరి
తాతయపతి, రామకృష్ణధరపతి, కనకా
ఖ్యాతుఁడు, గున్నమ, దేవత
యై తగు రామమ్మ, వియ్యమాంబయు సుగుణల్.

భూరివదాన్యులౌ సుతులు మువ్వురయందున రామకృష్ణభూ
మీరమణుం డమేయగుణమేదురుఁడై, పతిభక్తిగల్గి శృం
గారగుణాభిరాములనఁగా నుతికెక్కిన రాజమాంబ నాం
చారమ రత్నమాంబ లనుసాధ్వులమువ్వురఁ బెండ్లియాడెఁదాన్.

ముదముతోడ సతము మూఁడుమూర్తుల రామ
కృష్ణవిభుఁడు రామకృష్ణుఁ డనఁగ
నలువుచెలువు గలిగి నాంచారమన్ రమన్
బోలుచెలిని బెద్ద ముద్దుసేయు.

గౌరవసంపదల్ వెలయఁగా నతఁ డెంతయుఁ గాంచె నంతు నాం
చారమయందు భీమునవిచక్షణశాలిని, సుబ్బరాజ గం
భీరకృపాకరున్, సుగుణవిశ్రుతుఁడౌ నరసింహభూవరున్,
ధీరుని బుల్లితాతయ సుధీవరు, గున్నమ, రాజమాంబలన్.

ఆసువారి కోడలైనది గున్నమ్మ
కొట్టువారి యనుఁగుఁ గోడలయ్యె

రామమాంబ, సుగుణశాసులు వారిచే
నుభయవంశకీర్తు లురవడించె.

పడసె నుద్దీ లేని బహుకీర్తి శ్రితజనా
వనరక్షణమున భీమనవిభుండు
వెలసెఁ బోటీ లేని గెలుపుతో సుబ్రాజ
విభుఁడు స్వార్థత్యాగవిమలబుద్ధిఁ
గాంచెఁ గమ్మనియశఃకాయమ్ముతో పాటు
నరసింహవిభుఁడు విశిష్టసుకృతిఁ
బఱపె భీమఖ్యాతి బలసంపదల సంప
దలమేటి బుల్లితాతయవిభుండు
మఱచి కాలిడ్డఁగ ద్దఘుమర్షణమ్ము
మురిసిమాట్లాడఁ బ ద్దురుపుణ్యమునకు
నరసి వీక్షింప ర ద్దరిదైన్యభావ
మనఁగ మద్దాలవారు పెంపలరినారు.

స్వకులవారినిధికి జాబిల్లిగా బుల్లి
తాతయాపరాభిధాన వేంక
నార్యవిభుఁడు వెలసి నరసమాంబామహా
సాధ్వి నేలె కాని సంతులేదు.

ఆలోచింపఁగ నర్సమాంబఘనపుణ్యమ్మో నో తాతయ్య భూ
పాలశ్రీసుకృతమ్మొ యానో తనపూర్వానేకజన్మార్జిత

శ్రీ లాభించెనో రామకృష్ణధరణీసీమంతినీభర్త ము
ద్దాలశ్రీవిభవమ్ము నేలె భగవద్దత్తప్రసాదార్ద్రుఁడై.
గున్నమాంబసుతుఁడు కన్నతల్లి గతించి
యేడు దినములైన యేగకుండ
బుల్లితాతయప్రభూత్తము దత్తపు
త్రతఁ గడించె నోహో దైవబలము.

చెప్పఁగవలె సుబ్రాడ్విభు
గొప్పతనము సంతు గలిగి కూడఁ దనకు నా
చొప్పున మత్కృతిభర్తను
నప్పనమిడె ననుజభూసమగ్రశ్రీకిన్.

ఏవంవిధరాజ్యమహా
శ్రీవిభవుండైన సుగుణశేఖరునకు సం
సేవితహరిపదనఖరున
కావిష్కృతదానలహరికాముఖరునకున్.

శ్రీలలితరతికి మృదువా
ణీలోలన్మతికిఁ బుణ్యానిరతికి దానా
ర్ణోలహరితభూతికి ము
ద్దాలశ్రీరామకృష్ణధరణీపతికిన్.
రామాపదార్పితమానస
సీమున శతమధురరూపజితకామునకున్

శ్రీరామకృష్ణనామున
కామోదిత కావ్యరత్నఘనదామునకున్.

శిబికర్ణదధీచిముఖ
ప్రబలవితీర్ణిప్రశస్తిపరతంత్రున కా
త్మబలప్రతిపాదక కా
ర్యాబహుళరచనాస్వతంత్రరసతంత్రునకున్.

శ్రీవిమలకటాక్షునకున్
దైవాలయధర్మకర్తృతాదక్షునకున్
భూవరసల్లక్షణునకు
ధీవిభవవిచక్షణున కుదీర్ణునకున్.

వేలకొలందిగ ధనమిడి
వాలాయముతోడ వీరవాసరవిద్యా
శాలన్ స్థాపించిన మ
ద్దాలశ్రీరామకృష్ణధాత్రీపతికిన్.

అభ్యుదయపరంపరలు మ
హాభ్యుదయముగాఁగ దిగ్జయాభ్యుదయముగా
నభ్యుచితచంద్రగిరి దు
ర్గాభ్యంతరభవ్యకథను బ్రారంభింతున్.

ఇది కృతిసమర్పణము

# చంద్రగిరి దుర్గము

## ప్రథమ ఖండము

శ్రీ వీరవాసరాంచిత
భూవర ! మద్దాలవంశ భూరిపయఃపా
రావారసుధాకర ! వా
ణీ విద్వర ! రామకృష్ణనృపతి శేఖరా !

అవధరింపుము దేవ ! దివ్యానుభావ !
తెలుగునాయకవంశ సత్కీర్తిరూప !
నిఖిల సద్గుణవిమల మణీకలాప!
మధురజీవన ! సత్కళామంజుభవన !

ఉదయాచలేంద్రుని హృదయకోశమునందు
రాగస్రవింతికల్ జాలువాఱ
ప్రాచీదిగంగనాస్వర్ణఫాలమ్ముపై
ముసురువోచు నీలిముంగురులు మెఱయ

ద్విజగణ మ్మోలుగించు విజయగీతికలు మం
జులగళమ్ములనుండి మొలకవాఱ
జీవలోకము చేతనావిష్క్రియాజ్యోతి
వెలిఁగించుకొని కుతూహలమువడఁగ
మలయపవమాన మృదుకంపమాన జయప
తాక రెపరెపలాడఁ జంద్రగిరిదుర్గ
భాగమున నుషోదేవిగర్భముననుండి
వేడ్కతో లోకబంధుఁ డావిర్భవించె.

తరణిమయూఖముల్ తగిలి తప్పిన సన్నని లేఁతచీఁకటుల్
విరియు విభాతవేళ నృపవీధిని బారులుతీరి మండలే
శ్వరు లొకకొండ జేగుదురు పార్శ్వలతాతరుకాండమంజరుల్
శిరములుతాకినాట్యములు సేయహుటాహుటిఁగొల్వుశాలకున్.

ఆయెడ వారికి యాచమ
నాయండను మండలాధినాథుం డగ్రే
యాయియై యొప్పియుండెను
శ్రీయుతమగు కృతికి మొదట శ్రీకారమటుల్.

ఏ వీరువిక్రమం బీ నాఁటికిన్ దవా
నల మట్టు శత్రువనమ్ము లేర్చు
నే దయానిధికీర్తి యీ రేయినిన్ సుధా
నిధివోలె వలిపవెన్నెలలు గాయు

నే కోవిదునిప్రజ్ఞ నీ వేళ నాముక్త
మాల్యదన్ సర్వజ్ఞమహిమఁ జాటు
నే కళావిభుశిల్ప మిపుడు ప్రావడియు జీ
ర్ణావశిష్టము హంపియే వచించు
'రాయ' లను స్వీయనామాక్షరమ్ము లెవని
వయ్యె రక్తరేకులు సమస్తాంధ్రజగతి
కతనిపులితోలుగద్దెపై నధివసించి
వీరవేంకటపతి నేఁడు వెలయుచుండె.

తన కరాసితటిల్లతాజృంభణము బిజా
పురపతి మబ్బులం దరసి కలఁగఁ
దన నేత్రరాగరక్తచ్ఛటల్ గోల్కొండ
సులతానుఁ డిరుసంజఁ జూచి బెగడఁ
దన వజ్రకవచరక్షణ మిబ్రహీమున
కనుకొన్న చోటున కమరుచుండఁ
దనవాక్య మభయహస్తముగ నాదిల్శాహి
కల్యాణిదుర్గకాంక్షలు ఫలింప
రాయలే లేఁడు గాని పరాక్రమమ్ము
నిజ మతనిదె యనంగ నిర్ణిద్రశక్తి
నాంధ్రసామ్రాజ్య మేలిన యళియరామ
రాయలై నేఁడు వెంకటరాయ లొప్పె.

అతఁడు సంతుకొఱకు నార్వురసతులఁ జే
పట్టె కాని ఫలము ముట్ట లేదు
అన్నసుతులఁ దిరుమలాధిపు రంగ్రాజుఁ
జేరఁదీసి తృప్తిఁ జూఱఁగొనెను.

అతఁడు ముదిమియు లేఁతవయస్సు కాని
నడివయస్సును మీఱిన యొడయఁ డగును
నాఁటి దర్బారు జగతికి నయనపర్వ
మగువిధమ్మునఁ గలకల లాడుచుండె.

సార్వభౌముని మణిగణస్థగితసింహ
పీఠికానైకటస్థలవేదిమీఁద
రత్నకంబళమందు శ్రీరంగరాజు
జగ్గరాయలు నెడగా నిషణ్ణులైరి.

రెపరెపలాడు సన్నని జరీమఖ్మల్ కయిసేసి పార్శ్వమం
దుపహితపీఠికావళి మహోజ్జ్వలలై విలసిల్లుచుండి రా
నృపసుతు, లం దొకర్తు తననిశ్చలదృక్కులతోడఁ దొంటిమై
వ్యపగతభీతితోఁ గొలువుపత్రములన్ గనుచుండె దీక్షతో.

కనుఁగొని పత్రి మింకొకటి కన్గొనఁగాఁ బుటఁద్రిప్పులోనఁ ద
జ్జనవిభురాణికన్గొనల జారినచూపులు ఘోరవజ్రపుం
గణికలు పద్మరాగమణిఖండములున్ గలగల్పి తత్సభా
జనములమీఁదఁ జల్లినట్లు సాగి తృటిన్ మఱలెన్ గిరుక్కునన్.

ఈ రాణికడగంట నెత్తులు దొలెనా
బ్రఁతు కింతతో నగ్గిపాలు మనకు
ఈ దేవికనుబొమ్మ లెగసి మోడ్పుండెనా
మనపుట్టి నట్టేట మునిఁగినట్టె
ఈ రాజసతి యావులించు టాకట్టెనా
యంతతో నిఁక మనయాట కట్టు
ఈ వీరపత్ని మోమెత్తి వీక్షించెనా
తను వింత లింతలై తునుఁగు నిపుడె

అని తలంచుచుఁ దాము దెచ్చిన యమూల్య
మణులు కానుకలువెట్టి నమస్కరించి
వెనుకనడతోడఁ బాశ్చాత్యవీరు లామె
కోలచూపులసెలవుఁ గైకొనుచు నుండ్రి.

ఆమె గొబ్బూరియోబళక్ష్మామహేంద్రు
ప్రియకుమారిక జగ్గరాడ్విభు ననుంగుఁ
జెల్లియలు వీరవేంకటక్షితిపువలపు
మోసులెత్తించు కడగొట్టుముద్దురాణి.

నమితసామంతభూమిభృన్మణికిరీట
కిరణరంజితచరణుఁడౌ వరునిపేరఁ
బ్రాజ్యసామ్రాజ్యభూరిచక్రమ్ము నేఁడు
తనదు చిటికెనవ్రేలిపైఁ దరుణి త్రిప్పు.

పుటలు పఠించి యేమి తలపోసినదో కడగంటిచూపులోఁ
జిటిలెను విస్ఫులింగములు శీర్ష మెవానిది కోటకొమ్మునన్
జొటజొట రక్తపూరములు జొబ్బిలగాఁ దగిలింపమండిరో
గుటగుటలాడు ప్రాణములు గుప్పిటఁబట్టిరి తత్సభాజనుల్.

క్రుద్ధగర్జారవము కంఠరుద్ధ మగుచు
వెడలినది యామెవివృతాస్యబిలమునుండి
యమృతకరమండలము కూడ నుమియు నేమొ
యురుభయోదగ్రగర్జాగ్ని నొక్క నాఁడు.

కఱకఱి నామె పల్కెఁ "నవు గాము లెఱుంగనికుఱ్ఱఁడంచు మా
తిరుమలరాయనిం దలఁచి తీరనిముప్పును దెచ్చుకొంటి మీ
మొఱకు సహింపఁగాఁదగని పోటరియై తన చిన్నయింటికే
దొరకొనెఁ గన్నముం బొడువ దొడ్డఱికమ్ములు లుండఁగావలెన్.

ఎంతటి దురాశ యెంతటి యేహ్యభావ
మెంతటి దురంతచింత యెంతెంత దురధి
గమ్యమైన స్వామిద్రోహకార్యదీక్ష
పామునకుఁ బాలుపోయఁ జేపడునె తేనె.

బరిమీఁది కెక్కించి పఱియలు వాఱఁగాఁ
గండకండలు చెండఁ గలదె యఘము ?
తల్లక్రిందుగా నుఱిత్రాట వ్రేలనుదీసి
యొడలొలిపింపఁ జేపడునె చరిత?

మింత లింతలు కాఁగ నినుపకత్తెర్లతో
మెయినూడఁ బెఱుక దుర్ణయమునగునె ?
నిండుప్రాణముతోడ నిలఁబెట్టి తలనుండి
గసిక దింపిన నేల దొసఁగువచ్చు ?
మేకవన్నియపులిని ప్రేమింప నేఁడు
మమ్ము దినుటకై నోర్వొప్పె మాటునుండి
క్రుళ్ళిపోయిన యంగమ్ముఁ గోయకున్న
దేహమెల్లఁ జెఱచి ప్రాణమే హరించు."

అని వచించి కరస్థరహస్యవిషయ
విప్లవ నిబోధి పత్రముల్ విభునిచేతి
కందఁజేసిన దాతఁ డాసాంత మరసి
యురవడిలునల్కబుసలూడ్చు నురగ మగుచు.

పెద్దకుదుళ్ళుల గుప్పుగాఁ బెరిగి పైకి
వంగి యూఁదోఁకగా సాగి నింగి కెగసి
కొసలు దేరుచు మెలిగొన్న గుబురుమీస
లుద్దవిడి కేల దువ్వి సభ్యులను బలికె.

తిరుమలరాయఁడే వసుమతీరమణుండఁట చేతగాని భూ
వరుఁడఁట వీరవేంకటనృపాలుఁడు కల్లలబొల్లి చేతికీ
ధరణిసమస్త మెత్తెసఁట తాను సహింపఁగ లేఁడదంట యీ
గిరసకు నేఁటికా బుసకొసీచులు పోసినమందు పాఱుటల్.

ఎవరక్కడఁ ? బిలువుం డా
యువరాజున్, గాదు కా దహో చతురంభో
ధి వలయితోర్వీ సమ్రా
ట్టవునట యతఁ డట్లు పిల్వఁ డరయఁగవచ్చున్.

ఆ క్షమాపతివ్యతిరేకలక్షణావ
బోధకమ్మగు శాసనమున్ గ్రహించి
విచ్చుకత్తులతోఁ బోయి వీరభటులు
పట్టి తెచ్చిరి తిరుమలప్రభువు నటకు.

చిత్తమునుండి దుర్మలినచింతలు చిందునొ కత్తికాటుకున్
నెత్తురుచుక్క లే దతని నెమ్మొగమందు ననేకజన్మ సం
పత్తగు పాప మిప్పటికిఁ బండినదో యతఁ డింతయున్ శిర
మ్మెత్తఁడు చూడఁ డేమనఁ డదే ఋజువో తనద్రోహబుద్ధికిన్.

నరక మనునది తనుపతనమ్మపిదప
నెటనొ పైలోకమందు లే దిటనె వేచి
పొంచి యున్నది జీవి కన్పోల్కి నెనఁగు
నృపతిచెంగటి బోనుపై నిల్చి రతని.

తనతండ్రి లేని లోటును దీర్చుతండ్రిపై
    నీతని కీ బుద్ధి యెట్లు పొడమెఁ
దనచేతులారఁ బెంచిన చక్రవర్తిపై
    నెట్టు లీతఁడు కత్తిఁగట్టఁ బూనెఁ

దనవెన్క నితఁడె రాజని చాటు రాజ్యకై
        యే మొగమ్మున గోతు లితఁడు ద్రవ్వఁ
దనుఁజూచి సుతులు లేరను చింతవిడిన యీ
        తనిపై విసరె నే రీతి బాకు
నేల తప్పు వినాశకాలేరితమగు
వైపరీత్యప్రబుద్ధి యీ ఫల మితండు
కుడువ వలె నని సభ గుసగుసలు వోవ
తిరుమలుని రేఁడు కన్నారఁ దేరిచూచి.

తిరుమలరాయఁడా పిత గతించిననాఁటికి నెంతవాఁడవో
యెఱుఁగుదువా నినున్ జెనసి యూఁగయుఁ బ్రాణముమేననిల్పెనా
ధరణిసమస్త మేల సరదా గలదా వచియింపవచ్చునే
పరులను గూడి తంత్రములు పన్ని మమున్ బడఁగొట్టనెంతువా!

సరి చాలున్ నీ భావ
మ్మరసితి మేమన్నఁ దండ్రి యణఁగారిన లేఁ
జిఱుతఁ డని యందు రిఁక నీ
దురితక్రియ కేమి శిక్ష దోఁపదు మాకున్.

అనుచు ధర్మాధికారులహస్తములకుఁ
బంపెఁ బత్రముల్ వారు సభానృపాళి
దృష్టికిం దెచ్చి రామీఁద దృష్టిఁ బఱపి
బుడుతకీచు లాలందులున్ బుచ్చుకొనిరి.

సెంటుధోమునృపాలుచేవ్రాలుగల చీటి
యీ రాణి కెట్లు చేకూరెఁ జెపుమ
పులికాట్టుదొరవ్రాఁతగల కమ్మ యీ రాణి
కెట్లు సిద్ధించెనో యెఱుక పడదు
గోవాగవర్నరుకూటనీతివిశిష్ట
పత్ర మెట్లీ రాణి పడయఁగలిగె
స్పెయినుదేశఫిలిప్పుచేతిదస్తూరి ము
ద్రాలేఖ లెట్టు లీ రాణిఁ జేరెఁ
బిఱికితిరుమలరాయని పేరితోడ
వెలితివడ్డది పడమరబేరగాండ్ర
రాజనీతి యటంచు నప్రాచ్యులెల్ల
గొణఁగి క్రుక్కినపేలట్టు లణఁగినారు.

ఆయెడఁ గసటున యాచమ
నాయఁడు బుసకొట్టి లేచి నడుకుచు వహ్ని
ప్రాయమ్మైన కోపము తన
కాయమ్ము దహించివైవగా నిటు లనియెన్.

తిరుమలరాయఁడా! కఱకుఁదేఱితివయ్యా! స్వదేశభక్తికిన్
మురిసితిఁ గాని నిన్ గరిడిముచ్చని యింతకు ముందెఱుంగ నిన్
దురిమెనఁ బట్టినన్ గలదె దోసము, మమ్ముఁ బ్రతీచివారికిన్
వరవుడమెత్తఁ బాల్పఱచు పాపము నీయెడ బ్రద్దలయ్యెనా?

పడమరవారికై వలపు వడ్డికిఁ బాటినదా కృపాసుధా
జడమతులొాటఁ గిట్టర స్వజాతిసధర్మ్మలు తూర్పువారు నీ
యడుగడుగందుఁ బుట్టి యడియాసలు గట్టిన గాలిమేడ లీ
పుడమిని గూలిపోయినవి పో చెడుగా! పరలోక మేలఁగన్.

అని కూరుచుండె యాచమ
జనపతి శ్రీరంగరాజు జనవిభుమోమున్
గనుచుండె నగ్రజన్మని
ఘనరాజద్రోహకర్మ కంప మ్మొదఁగన్.

ఈతని కుటిశిక్షయే వ్రాసెఁ దప్ప దం
చెడఁదలఁ గొంద ఱూహించుచుండ
రారాజు కరుణాతరంగితుం డిది సహిం
పఁడో యంచు కొందఱు బాధపడగ
యువరాజు జగ్గరా జవును నేఁటికిఁ గోర్కి
ఫలియించె నని రాణి కులుక లోన
శ్రీరంగవిభునైన నీ రాజిఁకన్ నమ్మ
నా యంచు యాచమనాయఁ డడల
ఏమి వచ్చునో యా సార్వభౌమునోట
నే వినిర్మలధర్మ తేజోవిశేష
మతని వదనారవిందమం దవతరిలునో
యంచు సభయెల్లఁ జూడగా నా విభుండు.

తిరుమలరాయఁడా ! వయసు దీరిన నీ పినతండ్రిగుండెపైఁ
బఱపుదువా నిశాతకరవాలమునున్ బిడిదాఁక నిత్యమున్
మురియుచు మిమ్ముఁజూచికొని పుత్రులు లేరను చింత బాయు నా
త్తురులనె త్రావి యయ్యది యితోధికతృప్తిని గాంచఁగల్గునే !

ఓ నా పుత్రా ! యిదిగో
యీ నా ఘనరాజఖడ్గ మిది చేకొని యే
దీ నీ కసి పోఁ బొడువుము
యీ నా యుర మిడ్డ పుడమి నేలఁగవచ్చున్.

అనుచుఁ గరవాల మాధీరుఁ డతని మ్రోల
విసరి తనజోమ్ము కవచమ్ము విప్పి చూపెఁ
బ్రజయు నిది యేమి శిక్ష సెబాసటంచు
ముక్కుపై వ్రేలుజొన్పి యబ్బురము సెందె.

తిరుమలరాయం డదలుచు
కరములు ముకుళించి తప్పు గావుము తండ్రీ !
కరుణార్ద్రి మ్మా యుర, మిటుఁ
గఱకుటసిన్ దింపి బ్రతుకఁగలవా తండ్రీ !

దుర్నీతివిష మెట్లో దోయిలింతును గాక
చైతన్యహత్య నాచేతఁ గాదు
మూర్ఖతానల మెట్లో మూటఁగట్టుదుఁగాక
వాత్సల్యదగ్ధి నా వలనుగాదు

అరిపక్షఫణి నెట్టొ యాశ్రయింతును గాక
తాల్మిఁ గాటొంద నా తరముగాదు
వ్యాజాసిమొన నెట్టొ పవ్వళించెదఁ గాక
ఆత్మను గ్రువ్వ నా కలవి గాదు
శత సహస్ర మహానలజ్వాల లెగయు
నరకయాతన లెన్నని నాకుఁ దప్పి
పోవుఁ గాక తండ్రీ! యిపుడు మీ వివేక
వృద్ధవక్షమ్ముఁ బొడువఁగా లే నొకింత.

అని పాదమ్ములు ముట్టినఁ
గనికరమో రాజనీతికఠినత్వమొ త
జ్జనవిభుఁ బురికొల్పినయది
తనపదములు లాగుకొని యుదగ్రుం డగుచున్.

ఛీ, పిఱికిపంద! యీపాటిదా పరాక్ర
మప్రశస్తమైనట్టి యుష్మత్కరాస్త్ర
విద్య? నా యుర మ్మింక నో వెకలి! యిప్రుడు
పొడువ వస లెవ్వరిది ముందుఁ బొడువలేవు.

ఈ పరితాపవహ్నియే యింక మీఁద
బ్రదుకనీయక నిన్నుఁ జావంగనీక
నీదుభావాగ్నికుండమందే జ్వలించి
నీ యుసురు లెల్ల దహియింపఁజేయు శిక్ష.

ఈ శిక్ష చాలుఁ బో పొ
మ్మా శిశుమాంసమ్ముఁ దఱిగి యొండించి తినం
గా శంకింపనివాఁడా !
దేశమ్మును విడిచి నీ యథేచ్ఛను నెటకేన్.

నీ శిరముపైని ఈతా
రాశశిరవిమండలములు బ్రతికెడివరకో
దేశద్రోహీ ! మూని
ర్దేశపిశాచమ్ము నిలిచి నృత్యము సేయున్.

ఇంక నీ యావరాజ్యమం దీసిరంగ
రాయఁ డెసఁగుత మీ జగ్గరాజు మాకుఁ
బ్రతినిధిగ నుండి పశ్చిమప్రభుల నేలు
గావుత మిఁకఁ దత్స్వామ్యముల్ పోవుఁగాత.

అనుచుఁ దక్తునుండి యా రాజు లేచెఁ ద
త్సభయు లేచె రాణిస్వాంతమందుఁ
గుమిలి కుమిలి రాఁజు క్రోధానలజ్వాల
రగిలి వదనమందుఁ బ్రతిఫలించె.

చతురుదధి వలితవేలా
వృత సకలోర్వీవిశాల విజయనగర సాం
ప్రతసామ్రాజ్య సువర్ణో
న్నత మణిసింహాసనమున న్యాయము నిలిచెన్.

అనుచుఁ బ్రజలు దివ్యానందవారాశి
యీదులాడుకొనుచు నేగినారు
తిరుమలేశ్వరుండు దేశమ్ముసరిహద్దు
దాట గెంటఁబడెను దక్షిణమ్ము.

నిరతవదాన్యతా మధుర నీరధునుల్ హృదయప్రసన్నతా
సురుచిరపల్లవమ్ములు వచోమకరంద గుణప్రసూనముల్
శరదమలేందుకీర్తిఫలసంతతులున్ సుకవిద్విజావళుల్
వరలెడు రామకృష్ణనరపాల సురద్రుమ ! దేవసద్రుమా !

తేజోవిక్రమపాండితీమిళిత
మూర్తీ ! కీర్తిచంద్రాతప
శ్రీజీవన్నిఖిలాంధ్ర సత్కృతి
చకోరీజీవనాధార ! నీ
రేజాక్షప్రతిమానమాన్యఘన
లక్ష్మీ సంపదాఢ్యా ! మహా
సౌజన్యాన్విత రామకృష్ణవిభు
లజ్యామండలాఖండలా !

ఇది ప్రథమఖండము

# చంద్రగిరిదుర్గము.

## ద్వితీయఖండము

శ్రీలక్ష్మీసుమవల్లీ
జాలాలంకారచంద్రశాలా! సుయశో
జాలా! దోషవిపినకు
ద్దాలా! మద్దాలవంశధరణీపాలా!

అవధరింపుము దేవ! సత్యప్రభావ!
పూజితామలహరిపదాంభోజ! భోజ
సదృశగీర్వాణదివ్యభాషాప్రపూర్ణ!
పూర్ణసమ్మోదనిత్యప్రఫుల్లహృదయ!

అది యినుఁడస్తముంగనిన యట్టి
దినాంతము పంకజేందిరా
వదనముఁ గన్గొనంగ భయ
పడ్డవి తేఁటులు రాత్రికాంతకున్

హృదయములోఁ దమోగుణము
హెచ్చె నిశాచరుఁ డింకనున్ నభ
స్సుదతికి గర్భమందుఁ బడు
సూచన కన్పడ లే దొకింతయున్.

రాణి కొండమ్మయొకకంట రక్తకణము
చిందుచున్నది యొకకంటఁ జిందుచుండె
నడచినంగాని పోని దుఃఖాశ్రుకణము
అమితనిశ్శబ్దమై యుండె నంతిపురము.

చుట్టునుగోట, యానడుమఁ జొక్కపుఁదోట, తదంతరమ్ములో
గట్టినమేడ, యందు మణికాంతిధగద్ధగితోరుదీపికల్
పెట్టిన కుట్టిమ, మ్మచట వ్రేలెడుపూవులడోల, దానిలోఁ
బట్టుపుకూల మా పరుపుపైఁ గలరాణి సుఖింప దింతయున్.

చలువలు జల్లనన్ వలపుజల్లులు గుమ్మనఁ గమ్మనత్తరుల్
చిలుకుచు నూయలూపుచు సలీసుగ వీవన వేయుచున్ దనున్
గొలిచెడిదాసికిన్ దనకుఁ గూర్చుచు హాయినిమోసికొం చహో
మెలమెల వచ్చు పయ్యెరలమేలములే మఱి గిట్ట వామెకున్.

తెలితెలి గన్నులలోపలఁ
బలపల దిగువాఱుచున్న బాష్పమ్ములలో
యలలై కలలై నిన్నటి
కొలువునఁ గల తలఁపుగములు కొఱకొఱ రేగెన్.

నీవే సమస్త భూమీవిభుత్వాధిర
        క్షాదక్షమతి వన్న మేదినీశుఁ
డీ పరిపాలన మ్మిష్టానుసారమ్ము
        మార్చుకో నీ వన్న మానవేంద్రుఁ
డొడ్డోలగమ్ము తా నుండి తీర్పెల్ల నా
        చేతనే చెప్పించు భూతలపతి
యుద్యోగ మొనసి యాయువుపట్టులెల్ల నా
        వారికే నిడిన నొవ్వని నరేంద్రుఁ
డేల యాపేరుటోలగ మ్మేలెఁ దానె
చులకనైతిని సభకు రాణులకు నేను
భావికాలికజీవచ్ఛవమ్ము కాఁగ
నాభవిష్యత్తు మాఱె నీ నాటినుండి.

పూజాడ తీయలేదా జగాజంత్రినై
        తిరుమలుం డెత్తు తాంత్రికపుటడవి
ఆచోకి లాగలేదా చోకాచోటినై
        బుడుతకీచుల పన్నుగడలకడలి
చూచాయ తెలియలేదా చురాకత్తినై
        రంగరాడాంత్రనాళప్రపత్తి
ఊగ డొలుంగలేదా గండ్రగండనై
        యాచముబుద్ధిచైతన్యంపుదాడి

## చంద్రగిరి దుర్గము

ఎన్నెఱింగిన ఫలమేమి యున్న దిపుడు
రాజు నావాఁడు కాడు శ్రీరంగరాయఁ
డే భవిష్యన్మహారా జిఁకింతనుండి
దాసిగా నుండుటకుఁ గూడఁ దగను నేను.

ఈ మహాసామ్రాజ్య మెటులఁ జేఁజిక్కించు
    కో వలనో తెఱంగో యెఱుంగ
ఈ రాజరాజు జీవించునందాఁక శ్రీ
    రంగరాయని మేన వ్రాల దీగ
నాకు సంతాన మేదీ కానరాదు ముం
    దైన సంతానాశ లేనెలేదు
ఏ నేలుకొన్నయట్లే తలంచితి జగ్గ
    రాయలచెయిజారిపోయె రాజ్య
మసలు రారాజు నాకురాజ్యాధికార
మేల చవిఁజూపె జూపెఁబో యేల యిపుడు
నన్నుఁ బోనాడి యగ్రజన్మాత్మజునకుఁ
గట్టఁబెట్టంగ నుండె నీ పట్ట మెల్ల.

ఏమీ యీ వేంకటపతి
భూమీంద్రుఁడు తలఁచెనో సముద్దండభుజో
ర్వీమండలఁ గొండమ్మను
సామాన్యస్త్రీవలెన్ నిజాంతరమందున్.

తిరుమలునిశిరముమీదన్
జరణమ్ముడి త్రొక్కితిన్ రసాతలమంటన్
దిరిగి యిఁక రాఁడతం డీ
సిరంగరాయఁడు కలండు చీఁడపురువటుల్.

నేఁటికిఁ గల్గెనా చెరిగి నిప్పులు నాతలఁ బోయుమేటి నా
నోట విసమ్ము మేపెడి ఘనుం డతేఁ డిఁక నెఱుంగుఁ గాక యీ
పాటికిఁ ద్రాఁచుఁబాము పగవట్టిన దయ్యది పొంచివేయు నా
కాటు యమాలయమ్మునకె కైకొని పోవునటంచుఁ దన్నిఁకన్.

ఓరి సిరంగరాయఁడ! మహోదయమందిన వాడువోలె బం
గారుకలల్ ఫలించినటుగాఁ దలపోయుచు నుంటివేమొ నీ
పోరచి యూరుపే లేఁగిపోవఁగ గాలను రాచి రాచి గో
బ్బ్రాఁపడంతి నీ తనువుబూడిద బుంగల కెత్తకుండునా?

నిండినకొల్వులో మురిసి నిన్నొక పెద్దను జేసి రాజమా
ర్తాండు డొసంగినట్టి యువరాజపదార్హత నీకు నిల్చునా
గుండెలు చీల్చి నెత్తురులు గ్రోలక బెబ్బులి వీడిపోవునా
నిండుమగంటిమిం గలుగునేర్పరివా నినుఁ గాచు కొమ్మికన్.

ఈ సామ్రాజ్యమహాధిపత్యము చలాయింపన్ బలే మూఁతిపైన్
మీసమ్మే వలెనా నిరర్థకమె యీనే స్త్రీతనూజన్మ యీ
వేస మ్మీమగజాతి వైచుకొని ఉంపిల్లన్ గటాక్షించి యా
దాసీన్యమ్ము వహించి మార్వలుకరాదా వీరనారీమణుల్.

ఘోర మగజాతియైనంత స్వర్గమగునె
యర్భకుని కేని తలకెత్తి యవనిభార
మెంతయో మోదపడు లోక మింతకాంత
వ్రేలువెట్టిన నందులో వెఱఁగుపడును.

చూచెద నీ హంగామా
చూచెద హక్కెవరిదో హుజూరున నా కా
నీచాతినీచభావ
ప్రాచుర్యము నీకు యౌవరాజ్యపదమ్మా!

అనుచు నిట్టూర్చి తనశిర మ్మాడఁజేసి
లీలగా నూగు తనమేల్మిడోల నొక్క-
యుదుటునన్ మీటె దానితో నూపుదాకి
యదటునన్ దవ్వులంబడి బెదరి జూచి.

ఈ మహారాజ్ఞి కే పామరుం డెగ్గాచ
రించెనో పోఁగాల మొనయఁ దలఁచి
యీ మహాదేవి నే యిచ్ఛగొం డెదరెచ్చఁ
గొట్టెనో జముబచ్చుపట్టుఁ గోరి
యీ మహాచతుర కే సామంతపశువు కో
మ్మూపెనో శృంగభంగోపకృతికి
నీ మహాసింహి నే హీనమానవమృగ
మ్మెదిరించెనో మృత్యువదనలిప్స

అకట యీరాణిఘూర్ణమానాయతాక్షు
లందు రక్తానలచ్ఛట లలముకొనియెఁ
జటులవిషవహ్నికోటులు చిటిలిపడఁగ
మృత్యు వెవనికి సాక్షాత్కరించినదియొ.

అనుచుఁ బుట్టింటిదాసి తా నంత లేచి
రాణిభావ మ్మెఱింగిన జాణ యౌటఁ
జీర మైసర్ది దరిసి జోహారు సేసి
మెల్లమెల్లన ననెఁ జెవినిల్లుగట్టి.

ఓ తల్లీ! కడలేని నీయెడఁద భావోద్రేక మాలింతుఁ గ
న్మూఁతల్ వేయక నీ దిగుల్ గనుదు నిన్నున్ నీదురాజ్యమ్ము జేఁ
సేఁతన్ నీటను నీవె దించుకొనుదో శీఘ్రప్రతీకార సం
ఘాత మ్మగ్గికి గుగ్గిలం బటు విపత్త్వ్రాతమున్ రేఁపదో?

ఎదిరి కనుగందకుండఁగ
హృదయ మ్మిసుమంత బాధ మొనయకయుండన్
బదుగురు విని యౌ నన మే
లౌదవఁగఁ దనకర్జమ్ము జరుపు టొప్పగుఁ గాదా?

మీ తలపై భారమ్మును
నాతర మని కాదు దింప, నాకొక వెరవున్
దోతెంచుట నోర్వ్యాప్పితి
నో తల్లీ, మీదుదాసి కున్నవా సెలవుల్.

అనుచు నొదిగి యొదిగి యులుకుచు నులుకుచు
వినయగుణము ముద్ద వెట్టినట్లు
యంజలించి మ్రొక్కె నాత్మదాసిని గోర
చూపుఁగొసలు వంచి చూచిచూచి.

'దీని కేమి తెలియుఁ 'దెలివితక్కువ దన్న
భావ ముబికినట్లు పకపక నగి
ధీరమంధరముగ నా రాణి 'యేమిటా
వెరవు చూత మేది వినుచు మోసి' !

అనినన్ జంకను గొంకును
వెనుదవ్వి జఝ్ఝించి మొక్కె పెనుసాహసమే
తనరూపై నటు దాసీ
వనిత వచించెన్ జగత్తుపైఁ గపిమించన్.

ఈ నరజాతికిన్ హృదయమే కనుపింపదు తుల్యభావమా
మానిసినెత్తుటన్ దురభిమానమహాగ్నికి నింకిపోయె నీ
పూనిన కార్యమందు మగమొల్కె యొకండు లభింపకున్న నో
మానవతీ ! జయమ్మొ యనుమాన మగున్ బరికించి చూడుమా!

ఈ జన్మకు మీకుఁ ద
నూజాప్తికి నోచుకొన్న నోమే త్వే దా
పూజ యిఁకఁ గఠోరదరి
ద్రాజీవకు ఈ త్వదీయదాసి కెసఁగెడిన్.

నాకుఁ గల్గియుండె మీకుఁ గల్గకయుండె
యొక్కరూప తోఁచుచుండుఁ దల్లి !
యూఁత లున్న జీవి కన్నమ్మ లే, కన్న
మున్న జీవి కాఁక లుండనిగతి,

నెలదప్పి నాకు మూఁడవ
నెల యిది సామ్రాజ్యమేలు నేత్రివి కాఁగాఁ
దలఁతువా నీకును మూఁడవ
నెలదప్పిన యట్లు చాటు నెగ్గుదువమ్మా !

నాకు జనియించునిసుఁగు నాఁడె నీకు
నంతఁజేయుదుఁ గడురహాస్యమ్ము కాఁగ
నీవు నాఁడె పురుషు నోయించుకొనుము
రాజ్యమే తనంతఁ జేఁజిక్కు రాణి ! నీకు.

తనబిడ్డన్ గపటప్రలోభయయి తంత్రిం బల్లి మూర్ధాభిషి
క్తుని గావింపఁగ నెత్తువైచినది యీ తొత్తంచు భావింపఁగాఁ
జన దో తల్లి ! విశాలరాజ్యము స్వహస్తమ్మైన వెన్వెంట నా
తనయున్ నీ నిశితాసిపాల్యాజిఁబి రక్తస్నాన మాడించుకో.

అనుచుఁ గాళ్లమీద నా దాసి వొరఁగి త
న్నమ్మియశ్రుజలమునన్ దదర్ఘ్య
పాద్యవిధులు సేయుపగిది లేవక యున్న
రాణి హృదయముబికిరా వచించె.

ఓసీ యెంతటిసాహసమ్ముగల దభ్యూహింపలేనైతి, నిన్
దాసీమాత్ర వటంచు నెంచితిని నీ త్యాగమ్మె మూర్తీభవ
మ్మై సాక్షాత్కృతి బొందునో యిచట రాజ్యప్రాప్తికైనట్టి నా
యాసే సత్ఫలసిద్ధిఁ బొంది మఱి ప్రత్యక్షమ్ముగా దోచునో.

నా యానందము కేది యంతు దఱి, చింతాతంతుసంతాన దు
శ్శైయోవృక్షవిపత్తటమ్ములు దరీదృశ్యమ్ములే కావు నా
కీ యానంత్యవిశాల విశ్వమున దాసీ! యో మహానందరా
సీ! యీ పుణ్యము నీకుఁ దక్కెనటె నీవే నే నిఁకై పోదునే.

ఈ సామ్రాజ్యము నాకులభ్యమగు తోనే క్రూరతన్ దాల్చి పే
రాసన్ నీ పసికూనమ్మైఁ దఱిగి రక్తస్నానమున్ జేయు రా
కాసిన్ గా నను నెంచుకొంటివటె నిక్క మ్మాజగమ్మెల నీ
దాసీజన్మ యనర్హ మౌనటె కుచింతన్ బాసి లేలెమ్మికన్.

అనుచు లేవనెత్తి యా లెమ్మ నీ యూహ
మేలు లెస్స యనుచు మేను నిమిరి
దానిచేతఁ బుత్రదానవాగ్దానమ్ము
పొంది ప్రతిగ వగపు డింది పలికె.

ఓ నిరుపేదరాల! జగదుద్ధరణమ్మునకై ఫలించు నీ
జేనెడు కుక్షికిన్ మెతుకుఁ జిక్కదటే మనుజప్రపంచమం
దీ నవరాజ్యలక్ష్మి కిపుడే యభిషేకమొనర్తుఁ జూడు నా
పూనిక నీదుకుక్షి మొగమొల్కను నా మణికాంచిసత్కృతిన్.

అని దగద్ధగద్ధితమై యలరు కాంచిఁ
గటితటిని దీసి యా దాసికటి బిగించె
భావిరాజ్యేందిరను బాహువలయమందు
వేడ్క నీ నాఁడె బంధించివేసినట్లు.*

అపుడ జగ్గనృపతి సచటకు రప్పించి
విపులనిజశుభప్రవృత్తిఁ దెలిపి
వ్రాయఁ జేసె లేఖఁ బ్రళయకావేరిద
ర్పారులోని సార్వభౌమునకును.

శ్రీమన్మంగళవస్తు
స్తోమ్ము ఘుమంఘుమిత మత్తశుండాలముపై
సీమంతోత్సవ మేత
ద్భూమండలి మూఁడుప్రమాయ బ్రమోసెన్ బిదపన్.

దానశ్రీకరకంకణక్వణన నిత్యాహూత చింతామణీ!
గానశ్రీగళ మాధురీకలరవ జ్ఞాతాది దేవా! లస
న్మానశ్రీ సమలంకృతాత్మబలధామా! సాహితీసప్త
తాన శ్రీపరిపూత భూవలయకాంతా రామకృష్ణప్రభూ!

వ్యాఖ్యాతీతమనోజ్ఞసద్గుణకలాపా! భూరిసత్కార ధ
ర్మఖ్యాతాపర ధర్మరాజ బిరుదా! మద్దాల శ్రీరామకృ
ష్ణాఖ్యా చిహ్నిత పీఠవాసరకళాశాలాప్రతిష్ఠాపకా!
ప్రఖ్యాతోన్నత! రామకృష్ణధరణీపాలా! తెలంగాధిపా!

ఇ ది ద్వి తీ య ఖ ం డ ము.

# చంద్రగిరి దుర్గము

## తృతీయ ఖండము

శ్రీ విలసత్తనురేఖా
లావణ్యావిశేషవిజితలక్ష్మీసుత ! స
త్పావనచరితా ! కృతిసు
శ్రీవర ! మద్దాలరామకృష్ణమహీవరా !

అవధరింపుము దేవ ! కల్యాణభావ !
దానకంకణకింకిణీధ్వనితహస్త !
నిస్తులసమస్తసుకవివాణీప్రశస్త !
సుగుణమంజూష ! మంజువచోవిభూష !

అది హేమంత, మినుండుదక్షిణ శా
వ్యాసంగమున్ మానిన
మ్మదితోత్తుండయి యుత్తరాశ
గదియన్ బోవుచు సంక్రాంతి పు

ణ్యాదినారంభము, రంగవల్లికలు
హర్మ్యప్రాంగణస్థాన మం
దుదయారుణ్య తుషారబిందు తర
ళజ్యోతుల్ ప్రసారించెడిన్

ఆ నాఁ డంబుజకాంత యూ యుదయసంధ్యావేళ లేఁబ్రొద్దు ని
ద్రానీర్కావి బెడంగురంగులు స్వమస్తన్యస్త హేమంత శో
భానీరంధ్రహిమావగుంఠనమునన్ భాసిల్లినన్ దాను లో
నూనెన్ నిర్యదళిచ్ఛలప్రకట పంకోద్భూతమాలిన్యమున్.

ఈ యనంతజగత్తు పాలించుచున్న
దేవదేవుని సామర్థ్యదీప్తిపోలె
నా యుషఃకాంతి ప్రకృతిముఖాబ్జమునకు
సుప్రభాతమ్ము చేకూర్చి సొంపు మిగిలె.

కెంపుగోడలు నిగారింపఁగాఁ బులుదోమి
పలువన్నెచూరుమొగ్గలు రచించి
మగరాలనెలకట్ల నిగనిగల్ సవరించి
పగడాలకంబాలఁ దగటుదీర్చి
బంగారుచీడీలు శృంగారముగ దిద్ది
దంతపుఁదలుపుటద్దాలు తుడిచి
పచ్చతోరణములన్ బంచాణ మొలయించి
వలిపంపుమేల్కట్లు జిలుఁగుపఱచి

నలుకెలంకులఁ బన్నీరు చిలుకరించి
మూలమూలలఁ గప్రంపుముగ్గు లునిచి
ప్రళయకావేరిని జయించి వచ్చునృపతి
కారతు లొసంగఁ బౌరు లాయత్తపడిరి.

వినఁ మొట్టు వాద్యములతోఁ
గనుగుట్టు సువర్ణపూర్ణకలశమ్ములతో
మును వెట్టు నివాళులతో
జని రెదురుగఁ బలికిఁ బౌరజను లతిభక్తిన్.

కనులలోఁ గెంజాయ తొనఁకుచే మెఱుఁగని
మీ కిదే మా నమోవాకమయ్య
కలహసూచకమైన పలుకె లేనట్టి మీ
యమలమూర్తికి మా జోహారులయ్య
పొట్టపై దెబ్బనుం గొట్టుటే లేని మీ
మధురమూర్తికి మా సమస్సులయ్య
వయసు కైవ్రాలినం గాని బ్రదుకు నెల్ల
నీ ప్రజారంజనముకె వ్యయించుచున్న
త్యాగధని! మీకు దీర్ఘాయు వగుతమయ్య
యనుచుఁ బౌరులు దీవించి రంత నతఁడు.

ప్రళయకావేరిజయరుధిరాంకితమ్ము
తనకిరీటమ్ము వామహస్తమునఁ దీసి

శిరము వంచెను బ్రతినమశ్చిహ్నముగను
రాజు ప్రజాలోకదాసుఁడన్ రమణగాను.

ఏల యీ రాజేంద్రుఁ డింత యమర్యాద
గా వామకరమునఁ గారవించె
నేల యీ కరుణాళుజాలిగుండెలలోన
నుదుటుపా టింతగా నుద్భవించె
నేలయీ గంభీరునిందుసుందరకీర్తి
నీ కళంకచ్ఛాయ లిపుడు దోఁచె
నేలయీ విజయియాస్యేందుమండలమునన్
స్మితలవజ్యోత్స్న కైసేయకుండె
నదిర ! యని పౌరు లాత్మలో మదనపడెడి
తఱిని నా ఱేఁడు తద్భావ మరసినట్లు
లోలగముఁ జాటఁజేసి తా నుద్దవిడిని
గొలువుశాలకు వేంచేసి కొలువుదీరె.

నరలోకకుటిలత తెఱమాటునున్నటుల్
తలపైని మేల్ముసుం గలవరించి
దూరునో ధర్మసంస్తుతు లన్నటుల్ గ
ర్ణవివరమ్ములన్ దూది సవదరించి
గాలినేన్ ముడివైవఁజాలు నన్నట్లు లేఁ
గానుపై మేల్నడికట్టు గట్టి

పురిటినీ ళ్లింతముందఱఁ బోసికొన్నటుల్
        పసుపు నిగ్గుగ మోముపై నలంది
తేని కల్లంతఁ బచ్చిబాలింతరాలు
రాణి కొండమ్మ వచ్చి చిన్నగవు కాన్క
వెట్టి పొత్తిళ్లఁ గసుఁగందు బిగియఁబట్టి
యమలమణిసింహపీఠిపై నధివసించె.

ఆమెనంటి రాణు లయిదుగు రాసీన
లైనవారు సముచితాసనముల
విభునిపాదని కటవిమల వేదిక మీఁద
భావిరాజు రంగరా జెసంగ.

అటు నెడగాఁ జమూపతులు నాపయి యాచమనాయఁ డాతుదన్
గుటిలుఁడు జగ్గరాయఁ డటకున్ నికటంబుగ రాణివాసపుం
బటలము తత్సమీపమునఁ బౌరజనాంగన లాదరిన్ మహో
త్కటమతి రాణిదాది యుచితస్థితిగా వసియించి రయ్యెడన్.

నేల యీనినట్లు నింగి నేలయు నేక
మైనయట్లు పౌరజానపదులు
విజయఘోషతోడ విచ్చేసి యాసభన్
విడిసినార లుద్దవిడిని మిగుల.

ఆతఱిఁ జక్రవర్తి మొగమం దొకనూత్నకళావినిశ్చల
జ్యోతి వెలింగె మండలసముజ్జ్వలమై, యమృతస్రవంతికిన్

మూఁతలు తీసి నట్టధరముల్ విడివాఁతె, వియద్విలంబిజీ
మూతము మ్రోఁగినట్లు గళమున్ వినిపించె గృపామృదుధ్వనిన్.

అంతము లేని దీ భువనమందలి జీవచరిత్ర, యం దిలా
కాంతులగాథ లన్న నణుకల్పకభాగము, లందులోన నా
వం తొక సూచికాగ్రముఖభాగమునైన భజింప, దిందులో
నంతిమపంక్తి నేఁడు ముగియంబడనున్నది మీసహకృతన్.

అని మొనన్ బోరి తునిగిపోయిన మదీయ
దక్షిణకరమ్ముబదులు మద్వామహస్త
మిడెడి యభివాదనమ్ము మీ హృదయములకు
నవమతిస్ఫోరకమ్ము కాదని తలంతు.

కలదయ్యా! జగమందు మీకె పెనుభాగస్వామ్య, మీరాజ్యమున్
గలకాలమ్ము సుఖింపఁజేయఁగల దీక్షన్ బొంది కైసేయుఁడు
జ్వలపూజాగ్రహణమ్మునందుఁ బ్రథమస్థానమ్ము, యుష్మత్తుతూ
హాలసంపాదకు నేత నెన్నుకొని యుం డర్హాధిపత్య మ్మికన్.

ప్రజలె తమంత రాజ్యము శుభప్రతిపాదకచిత్తవృత్తితో
నిజముగ దిద్దుకొన్నయెడ నేతల గీతల జోలియేల యా
నజరులతోఁ దదీయచరణాంబుజముల్ గొలువంగనేల భూ
భుజుల మటంచు వారు పలుపోకలు పోవఁగనేల కల్గెడిన్.

ప్రజలలో నైకమత్యప్రభావ మొకటి
కొఱఁతపడ్డది దానఁ జేకూరె నింత

నర్వుఁడా నేత నొక్కని నరసికొనుట
ప్రస్తుతమునకు మీకుఁ దప్పదని తోఁచు.

మీ రిడినట్టి యీ పదము మెట్టి యెఱింగినయట్టు దిద్ది యీ
ధారుణి నేలఁగా మిగుల స్వతఃపరిపూర్ణులఁ జేసినాఁడ, నే
దూరము తప్పికోసఁగ మనోరథ మిట్టొపఁగూడె నేటి కం
చూరుపు వుచ్చి తేఁడు ప్రజలున్నదెసన్ గనె నీరవమ్ముగన్.

అది గని క్రుంగి యచ్చటిమహాజనముండెను దుఃఖదేవతా
వసన విశాలగహ్వర వివర్తితమైనటు, చక్రవర్తి క
న్నుదలు చలించి కాళ్లకడనున్న సిరంగని మూర్ధముందు, నా
పిదప ననుంగురాణియొడిఁ బడ్డనెమ్మొగమందు వ్రాలెడిన్.

రంగరాజు గుండె అంపమై తనుఁగోసె
ధూర్తురాలు రాణి త్రుళ్లిపడెను
గరము లెత్తి కొలువు కాదు మా ననమతి
యిది యటంచు నేడ్పు టెలుఁగు నెత్తె.

ఆ రోజే యిహలోకజీవితసమస్యాపూర్తికిన్ హద్దుగా
మాత్రెన్ త్రేసికి, రాజ్యధూర్వహణధర్మస్థాపనా వేళ కిం
కా రోజే తుదియయ్యె భూపతికి, సర్వాంతఃపురస్త్రీలు చు
ట్టూరన్ జేరిరి శోకపువ్వఱద గట్టున్గొట్టి పైకొన్నటుల్.
ఆ రాజేంద్రుఁ డలోకికాద్భుతము బాహ్యానందసౌందర్యరే
ఖారమ్యమ్మగు రాణియాకృతిని గాంక్షన్ బ్రేమపీయూష మె

ట్లారాధించి స్వదించి సౌఖ్యపడెనో యట్లే సుఖమ్మొందెఁ దాన్
శ్రీరంగప్రభునాంతరంగిక గుణశ్రీమత్కళా రేఖకున్.

రాణి కొండమ్మగుండెలో రాయిపడిన
దుద్ద విడి జాళువాతక్తునుండి లేచి
పొత్తిగుడ్డల బిడ్డను బొదివిపట్టి
నృపతి డాచేతిదాపుగా నేగి నిలిచి.

పతిపదమ్ములు కుడిచేత వంగి ముట్టి
ఆ కరమ్మును గనులకు నద్దుకొంచు
బాష్పములు ముంచుకొని జాలువాఱుచుండ
నృపతిచూడ్కిని దనచూపు నిలిపి పలికె.

ఓ మత్ప్రాణపతీ! ఫలించినది యెన్నో నోములన్ నోచి త్వ
త్ప్రేమస్వాదుసుధాసవమ్ము పరితృప్తిన్ గ్రోలియున్నందుకున్
నే ముఖ్యాంగన నైతి నేఁటికని యెందేఁ జాటికొన్నైన నా
శ్రీమద్గర్భము దానికిన్ ఫలిత మిట్లీనాటి కిట్లయ్యెనా.

ప్రళయకావేరివిజయినై వచ్చునృపతి
కెదురుసూచెను బురిటిలో నీ నిసుంగు
ఇతనిముద్దైన తీరక యింత వృత్తై
భావిభార మ్మితం డెట్లు మోవఁగలఁడో.

మీ నోట నూడిపడిన
ట్టీ నిసు వచ్చముగ మీరలే యనిపించున్,

నానోముపై డిపంటకు
నీ నృపలక్షణకిరీట మీవయనునవా ?

అమృతహస్త మెత్తి యాశీర్వదింపుడు
అందుగల యమోఘమైన శక్తి
ఈ నిసుంగునెడఁద నివతళింపఁగఁ జేసి
భావిరాజ్యవహానపటు వొనర్చు.

అని మెల్లనఁ బొత్తుల బి
డ్డను హస్తము లెత్తి తేనిడాచేతి కిడన్
బనివడు వనితను గని య
జ్జనపతి మానమున నాపి సభఁ బరికించెన్.

చలువవెన్నెలజల్లు చిలికి నట్టు తేని
        చూపులు ప్రతిజీవిచూపు సోకె
ముక్తాఫలచ్ఛాయ ముంపుగొన్నట్టు త
        త్ప్రతిచూడ్కి కొలువెల్లఁ బ్రతిఫలించె
నమృతస్రవంతి ప్రస్యందించినట్టు త
        త్ప్రభునపాంగము సభన్ బాఱుకాడె
శ్రీఖండవాసనల్ రేగిన ట్లావిభు
        చూడ్కులు ప్రతిసభ్యుఁ జుట్టివైచెఁ
గనులఁ గెంపు లేదు మనమున వంపు లే
దరసి యరసి యొకట బెఱుకుతోడ

దాఁగి తన్నుఁ జూచు దాసిని బిలిపించి
దాసిచేతి కిడఁగఁజేసె నిసుఁగు.

రాణి గిఱ్ఱున నేగెను రత్నపీఠి
కనుగుదాసియు నామెవెన్నంటి సనియె
నృపతిమోమున మార్పు జనింపలేదు
తేరిచూచుచు సభయెల్లఁ దెల్లవోయె.

ఈ జేనియభిమత మ్మేమహానో తన్మతిన్
జను టొప్పు నని ప్రజల్ గనుచునుండ
రంగరాయనికె సామ్రాజ్య మీ రాజు తా
నిడు నిక్కమని యాచముఁడు తలంప
ప్రజలకే రాజ్య మీ ప్రభు వొసంగు నటంచు
రంగరాయులు లోనఁ బొంగుచుండ
రాజ్య మీ రాజు ధారాదత్త మొనరికిఁ
జేయునో యని రాణి చింతఁగూర
ప్రజలవాలక మా చక్రవర్తిపోల్కిఁ
గినిసి కని జగ్గరాజు గ్రుక్కిళ్లు మ్రింగ
దాసి నిలువునఁ గంపించి దాఁగఁజూడఁ
బుడమిపతి యోచనాంభోధి మునిగియుండె.

భూమీ నాటక రంగభూమిపయికిన్ మున్నీవిధిన్ మాధురీ
హేమంతప్రతిసీగ లెన్ని దిగెనో యీ భూమిభృద్భూమికా.

స్వామివ్రాతసద్వృత్తు లెంద ఱిట లాస్యమ్మాడిరో యెంద ఱు
ద్దామప్రౌఢి నటింత్రో ముందు నిదమిత్థమ్మెట్టు లీ తేనికిన్.

ఆశాభావము మానవప్రకృతికిన్ హాళ్కానో తత్ప్రేరితా
వేశోన్మాదకఠోరుఁడై మనుజుఁ డీ విశ్వోపభోగత్రుచు
మిన్మాశావాస్యమునా జగమ్ము ననుశాసింపన్ బ్రవర్తించెనో
ఆశాసించెదు నాఁడు నేఁడు కులమర్యాదాదురభ్యాసినై.

మనుజవిభుఁడు మెల్ల మణిపీఠికను డిగ్గి
రత్నఖచితమౌ శిరఃకిరీట
మౌదలన్ వెడల్చి హస్తమ్మునన్ బట్టి
ప్రజలు వెఱపడంగ బలికె నిట్లు.

బ్రదుకెల్ల సామ్రాజ్యపరము గావించి స్వా
ర్థమువంకఁ బోని యుదారగుణుఁడు
ప్రజల రంజించుటే పనిఁగా దలంచి రా
జ్యముఁ గాచుకొనెడి శౌర్యైకధనుఁడు
తనకళాదానమున్ జనలోకకల్యాణ
సిద్ధికే వ్యయపెట్టు సిద్ధహస్తుఁ
డాపన్నజనుల దైన్యావస్థ నెడలించు
దాఁక నిద్రింపని త్యాగబుద్ధి
యెవఁడో మీముందు నిటవచ్చి యీ ప్రశస్య
సింహపీఠికపై నెక్కి శిరము నందు

ఈ కిరీటముఁ దాల్చి పాలించుఁగాక
చంద్రగిరిదుర్గభూరిరాజ్యమ్ము నెల్ల.

ప్రభునిపలుకు వినియుఁ బ్రజలలో నొక్కండు
ముందుకరుఁగఁ డింత ముదమునందఁ
డతనిచిత్తమునకె యఖిలమ్ము వదలి న
ట్లైనసె మానముద్ర యెల్ల కొలువు.

రాణిచూపు జగ్గరాజుచూపును సంప్ర
తించె నటనె కార్యదీక్ష నెఱప
అది యపాంగదృష్టి కందఁగా సైన్యాధి
పతులవంకఁ గన్నువఱపె తేఁడు.

తళతళలాడెఁ గత్తులు సదస్సున దస్యులు భీతచిత్తులై
కలఁగిరి యాచమున్ నృపుడు కన్గొని యీ యువరాజువాదలన్
నిలుపుమ యీ కిరీట మని నీవని చేతికిడెన్ జయధ్వనుల్
బలియ నతండు దాని యువరాజుశిరమ్మున నిల్పె భక్తిమై.

ప్రజలనేత్రాల మోదబాష్పములు రాలె
రాణినయనాల నిప్పుకరవ్వ లెగసె
జగ్గపతిగుండె క్రిందికి జారిపోయె
యాచమునెడంద పొంగి మిన్నందుకొనియె.

నింగిని ముట్టు నా విజయనిస్వనముల్ వినలేఁడో రాణి చూ
పుంగవలోని నిప్పుకలఁ బుట్టుతుపానున కోపలేఁడో తా

జ్యాంగన నమ్మరాని నెలయూలని దాని గ్రహింపలేఁడో శ్రీ
రంగవిభుండు వజ్రాళిగతరత్నకిరీటముఁ దీసి యిట్లనున్.

ఓ తండ్రీ! యిది వజ్రాళిదాల్ప నెవఁ డర్హుండౌనో తన్మౌళిఁ జే
సేఁతన్ మీరె యలంకరింపు; డిది నాక్షేమంకరమ్మౌను; రా
జ్యాతిథ్యమ్ము నిరాకరింపఁగ నెవండైనన్ మదిన్ గోరునా?
చేతుల్ జోడ్చి నమస్కరింతుఁ దగ దీ శ్రీకాంక్ష నాకున్ ప్రభూ!

నా తన్వంగికి నా తనూభవులకున్ నాకున్ బరిజాసేవతో
స్వాతంత్ర్యమ్మునఁ గాలమెల్ల వెడలింపన్ జాలు నుద్యోగమున్
జేతఃప్రీతిగ నిండు చాలు వల దీ నిస్సీమసామ్రాజ్యకాం
క్షాతీక్ష్ణోజ్వలదగ్నిఖండపరిషిక్తజ్వాల నానెత్తిపై.

ఈ రత్నాసన మెక్కి యీ ముకుట మెంతేఁ దాల్చి యేతత్ప్రజా
కారుణ్యమ్ము గడించుకోఁదగు జగత్కల్యాణు కీ సర్వమున్
ధారాదత్తము సేయు టొప్పగు వృథా నాబోటి కీనొప్పునే
ఈ రాజ్యప్రళయాగ్నికుండమునఁ దండ్రీ! దింపఁగా వద్దు నన్.

నా కీ రాజ్యము వద్దు; మీ యసువులున్నంజాలు మీ రే యిఁకన్
నాకున్ దక్కనినాఁడ యీ సుఖము లానందమ్ము నంధించునా
లోకుల్ కాకులు, తత్సహిత్రగుణ మారోపించి జీవచ్ఛవ
మ్మౌ కాయమ్ము నలంకరింపకుము తండ్రీ! నీవు వ్యర్థమ్ముగన్.

ఈ భూపాలపదాభిషిక్తసుఖ మన్వీక్షించి చూడన్ శుభ
మ్మౌభాసమ్ము, పరీభవప్రియనృత్య మ్మిందుఁ గన్పట్టు, నీ

ర్ష్యాభూయిష్ఠ బహూపపత్నియగు రాజ్యశ్రీగళమ్మందు నా
చే భూపాల! ధరింపఁజేయకుమి యీ శృంగారమాంగల్యమున్.

అనుచు గనుంగవన్ దొరలు నంబువు లాగక పొంగిపోవఁగా
రణరణకమ్మునన్ బెగిలి రాక నుడుల్ గళ మెండిపోవఁగా
జనపతి రెండుకాళ్ళకును సాగిలి మ్రొక్కి కిరీట మా మహా
త్మునిమణిపీఠిపై నిలిపెఁ బొక్కుచు వెక్కుచు దీనదీనుఁడై.

ఇది యేమి యువరాజుహృదయ మిభ్భంగిఁ బ
　　రావర్తితమ్మయ్యె నకట! యంచు
నిది సమంజసమె ధాత్రీశునౌరసుని గా
　　దని రాజ్య మితఁడెట్లు కొనునటంచు
నింతటి యైశ్వర్య మెవఁడు త్రోఁపాడు ని
　　ష్కల్మషుఁ డీతఁడుగాక యంచుఁ
జూడంగవలె నిఁకఁ జోద్య, మీ రాణి యెం
　　తకుఁ దెగించునో ముందుఁ దా నటంచు

గొంద ఱార్తి దిగులుగూరి చింతించిరి
కొంద ఱాత్మఁదలఁచుకొనిరి పాడి
కొంద ఱతని బొగడికొన్నారు కొందఱు
జోస్య మందుకొసరి చూచిరాణి.

మురములోపలఁ దనచేయి తునిగిపోయి
నప్పుడైనను దిగులొందకట్టి నృపుని

మొగములో జీవకళ మాసిపోయెఁ గనుల
మోడ్పులో రెండు కన్నీటిబొట్లు ప్రిదిలె.

తొణఁకెడు బాష్పబిందువులతో మెలిగొన్నగళస్వనమ్ముతో
వ్రణితతనూప్రకంపనవివర్ధనతోఁ జరమానుశాస్తితో
ననుపమరాజ్యరక్షణసమర్హనియంతృకమానసమ్ముతో
నెనసినయట్టి వామకర మెత్తి కుమారుని వీపుఁదట్టుచున్.

ఓ పుత్రా! నిను బాధపెట్టుటకె
యుద్యోగించి యీభారమున్
నీపై మోపితి, ఈ ప్రజాసుఖము
నన్వీక్షించి నినీ ధరా
రూపవ్యాఘ్రముముందుఁ బెట్టితి
వృథా రూక్షమ్ము కానీక నా
చూపున్, దూకుము యగ్నికుండమున
మెచ్చున్ ముందు నిన్ లోకముల్.

పాపమ్మో మఱి పుణ్యమో సకల భూభారమ్ము నిశ్చింతతో
నీపై మోపితి విశ్వసించితిఁ బ్రజానీకమ్మునున్ గోర ని
న్నీపీఠస్థితి కెవ్వఁ డర్హుఁడగునోయీ నీవు గాకున్నఁ దం
డ్రీ! పాలింపుము నాదుమాట సిరిమూలేయౌను నీ సంతుకున్.

ఈ బంగారపుఁదర్హుపై నసలు లేనేలేదు సౌఖ్యమ్ము త
త్ప్రాబల్య మ్మెవరేని యున్నదని సంభావింతురో వచ్చి దా

హాబంధమ్మున భూలతాంగిఁ గైసేయన్ వచ్చుఁ దన్మౌళి నీ
నా బంగారుమణీకిరీటమును సంధానించి వంతున్ దలన్.

రాపాడింపకు తండ్రి ! నాయెడద, సామ్రాజ్యమ్ము నీబాధకై
రూపంబెత్తెను నన్ను నీజనకతుల్యున్ నేఁడు మన్నింపవా
యీ పాపమ్ముఁదొలంచుకో నిపుడె నా యీప్రాణముల్ వీడి సం
తాపింతున్ బరలోకమందు సుఖమందన్ వచ్చు నీ విచ్చటన్.

ఆనందమ్మున నాదుప్రాణముల నిర్యాణమ్ము వాంఛింతువా
నీనోటన్ మఱిమాట వీడుము ప్రజానీకమ్ము సేవింపు మా
జ్ఞానిర్ఘాతము మామకీన మిది మస్తమ్మందుఁ గైసేయు మె
న్నేనిన్ నీకు లభించు మున్మును యశోనిక్షేపముల్ పుత్రకా

అనుచు రేఁడు మానసమందెను గోలువెల్ల
నిలువుగుండెతోడ నీరవించె
రాణిగండమందు రతనాల లేనవ్వు
పొటమరించి విసము పుక్కిలించె

ధరపతి కన్నుదల్ ప్రచలితమ్మయి చెంగటనున్న రంగరాట్
శిరమున వ్రాల గద్దియను జివ్వున లేచి మణీకిరీటమున్
గరమునఁబట్టి ముందఱ వినమ్రిత లేచి నమస్కరించు త
చ్ఛిరమున నుంచె నశ్రు లభిషేకమొనర్పఁగ ముత్తెపున్‌జడిన్.

కరతాళమ్ములు మిన్నుముట్టె విజయాంకధ్వానముల్ దిక్తటుల్
పరియల్ గొట్టె సువర్ణపూర్ణకలశాంభఃప్రోక్షణారంభమ

ర్మరశింజానినదమ్ము లుల్లసిలగా మాంగళ్యతూర్యధ్వనుల్
మఱువన్నెల్ సురాసురాబ్ధిమథనప్రారంభసంరంభముల్.
సభ లేచెను శ్రీరంగ
ప్రభుదీవ్యన్మౌళిముకుటరత్నజ్యోత్స్నా
విభవమ్ములు చంద్రగిరి
ప్రభుమందిరజయపతాకపై నటియించెన్.
శ్రీకల్యాణవిశేష ! శేషసమరాశీభూతవాగ్రూప! రూ
పైకీభూతవసంత ! సంతతకళావ్యాపార! పారాతిగ
శ్లోకా ! శ్లోకమనీయసజ్జనసమీక్షాదాన ! దానాతిక
ర్ణా ! కర్ణామృతశీల ! శీలజితరామా ! రామకృష్ణప్రభూ !
వేలకొలందిగ ధనమిడి
వాలాయముతోడ వీరవాసరవిద్యా
శాలన్ స్థాపించిన మ
ద్దాలశ్రీరామకృష్ణధాత్రీవర్యా !

ఇది తృతీయఖండము.

(9)

# చంద్రగిరిదుర్గము.

## చతుర్థఖండము.

శ్రీమత్కరుణాపాంగా!
రామాజనమోహకరణలావణ్యాంగా!
ప్రేమాంతరంగ! మద్దా
లామల శ్రీరామకృష్ణ మధురతరంగా!

అవధరింపుము దేవ! రమ్యస్వభావ!
బుల్లితాతయవిభుడత్పుత్రవర్య!
సత్కవీశానకృతివసీ చైత్రకార్య!
భోగదేవేంద్ర! త్యాగవపుశ్శిబీంద్ర!

చలివేళల్ కడచన్న వామని
జగా సన్నాయిమ్రోతల్ పికీ
కలకంఠమ్మున జాలుగొన్నవి
లతాకన్యల్ మరుత్స్వామిముం

గల మేల్ రింగుల వన్నెవన్నె పువు
　　　లంగాల్ దాల్చిలాస్యించినా
రలిపాటచ్చరు లాతతాయులయి
　　　వాహ్యాళించినా రయ్యెడన్.

రారాజు లేని లోటేరాక ప్రజనేలు
　　　నీ సమర్థత యెప్పు డితనికబ్బె
నితఁడన్న ప్రజలెల్ల నివతళించెద రిట్టి
　　　యింగితార్థ మ్మెన్నఁ డీతఁ డాడిసె
ప్రాణమ్ములైన నర్పణవెట్టు సిబ్బంది
　　　యీ పల్కుబడి యెప్పు డితని కొదవె
యాచమాదులు పెద్ద లతిభక్తిఁ జూతు రీ
　　　యెప్పిద మ్మితఁ డెన్నఁ డొదుగుపలచె
బొక్కసమ్మెల్లఁ బేదలభుక్తికిచ్చె
రాచదర్బారు ప్రజలదర్బారు చేసెఁ
జంద్రగిరి రాజ్యలక్ష్మి స్రవహిసన్న దృష్టి
కిడుమ యెఱుఁగని భ్రతుకెల్ల ముడుపు గట్టె.

అని కొనియాడుకొన్నది సమస్తజగమ్మును బొంగి రంగరా
జును సరిక్రొత్తరాజును, విశుద్ధవినశ్వరమైన జీవికన్
ఘనులు వ్యయించి తత్ఫలముగా నవినశ్వరకీర్తిసంపదల్
గొనుదురు తద్యశస్సు గుణలుబ్ధజగత్తు నుతింపకుండునా ?

అరుగుచో శతవృద్ధు లరుగులన్ శేవఁబో
హస్తసంజ్ఞను నాపి హాయుముదిగును
ఏగుచో సత్ప్రాజ్ఞ్యు లెదురైరె యొసంగు దీ
వెనలు గుఱ్ఱము డిగ్గి స్వీకరించుఁ
బోవుచోఁ బేదయిల్ పొడఁగట్టినన్ దేజి
దిగి వారి సేమమ్ముఁ దెలిసికొనును
వెడలుచోఁ బ్రజలు వెన్వెంటరా జవనాశ్వ
మవతరించి మృదూక్తు లాడుచుఁ జను
రంగరాట్చక్రవర్తి నిర్వ్యాజమూర్తి
చంద్రగిరి దుర్గ రాజ్యప్రజాళిలోని
సేమ మరయుఁగ వాహ్యాళిఁ జిత్తగించి
తేపుమాపుఁ బురిన్ సంచరించు వేళ.

ఆ సుగుణు మధురగుణములు
వాసించెన్ జగతి, జోలపాటలలోనన్
బ్రోసెన్ శిశువుల కుగ్గునఁ
బోసికొనిరి రంగరించి మురియుచుఁ దల్లుల్.

ప్రళయకావేరిలో నిలఁద్రొక్కి రంగరా
ట్ప్రభుత నొప్పని జగ్గవిభుఁ డొకండు
పెనుగొండజనులఁ గవ్వించి విప్లవవహ్ని
రాఁజఁజేసెను మాకరాఁ జొకండు

వేలూరిపరగణా నేలికోఁ దెలివెల్ల
  వెల్గించు రావెల్ల వెంకొకండు
నిలువున రాజ్యమ్ము నిర్దగ్ధ మొనరింపఁ
  బూంచిన దళవాయి చెంచొకండు
రంగరాయల గుణాలతల్ ప్రాకిప్రాకి
పండు చానోట నానోటఁ బడుచు వచ్చి
తవిలి విషవహ్ని గాఁ దమ చెవులసోక
నగ్గిపై గుగ్గిల మ్మట్లు భగ్గుమనిరి.

పక్కన నవ్వొ రాణి విషవహ్నికిఁ బూవుల తేనె పూయఁగా
నొక్కతె తాన నేస్తుఁ, గను లుండఁగనే కనుపాపఁ దీయఁగా
మిక్కిలి తాన చాలు, మిరుమి న్నెసగించెడి రంగరాట్ప్రిభా
చిక్కణకీర్తి కాయమ హసింపక యేగతి గారవించెడిన్.

పతి గతించిన వెంటనే బయలువెడలి
తనకు మున్నొక నాఁడు భూధవుఁడు మెచ్చి
ప్రణయ చిహ్నమ్ముగా దఖల్ పఱచినట్టి
సెంటుథోమున నిలుచు విచ్చేసి తాను.

అప్పటికి భర్తపోయి యేడాది యయ్యె
రంగరాయల యేల్బడి క్రుంగదీయు
తెఱఁ గెఱుంగక రాణిబుద్ధింద్రియమ్ము
బుసలు కొట్టెడిఁ గాటందు భుజగ మట్లు.

వెడలినది ధీరమంథరోర్వీవికాస
లలితగతి నామె యుపవనప్రాంతమునకు
నిలిచినది చేరి యచట సుస్నిగ్ధమసృణ
కిరణరంజిత బాహువల్లరులు సాచి.

చివ్వ చివ్వున వచ్చి పట్టీలుగొట్టి
యొక్కకరమునఁ బావురా లూదినిలిచె
రెక్క కదపని యుడ్డీన రేఖతోడ
సాళ్వములు కొన్ని యొక్క హస్తమున వ్రాలె.

తనమానస మ్మట్లు వెనుకకున్ ముందుకున్
దూగ యూయేలల నూగుచుండఁ
దన నీతిపథ మట్లు సునిశిత కుటిలతో
జ్జ్వల నఖమ్ముల నొక్కి నిలుచుచుండఁ
దన యెత్తుగడ లట్లు తపతప మనక మె
ల్లన రెక్కగమి యెత్తి వ్రాల్చుచుండఁ
దన వాంఛ లట్లు సాచిన చంచువులు వంచి
పట్టి పైపై కెగఁ బ్రాకుచుండ
రంగరాడ్బంధనమున కేర్పఱుపనున్న
వజ్రపంజర మిది యను పగిది బాహు
వల్లరులు మెల్లఁగాఁ జేర్చి పతగవితతి
ముద్దుగొనె రాణి యిటు నటు మోము ద్రిప్పి.

రావయ్య ! మా జగ్గరాయఁడా ! యని చీటి
యొక డేగ తెక్కల నొదుగుపఱచె
విచ్చేయు మోయి ! రా నెలవెంకు ! యని యొక్క
శ్యేనమ్ము మెడక్రిందఁ జీటి నిలిపెఁ
జేరరాగదవయ్య ! చెంచూ ! యటంచు సా
ళ్వముకాలి కొకచీటి లంకెవైచె
దయసేయు మోయి మాదానాయఁడా ! యని
చీటి నొక్కటి జాలెత్రోటిఁ గట్టెఁ
పావురాల్ కొన్నిటికి విప్లవంపుజీట్లు
చంద్రగిరిసంజ్ఞ తెక్కల జత పఱచెఁ
దోన బాహువు లెగసఁద్రోచి వాని
మింటి కెగయించి రాణి కన్నారఁ జూచి.

ఓరి సిరంగరాయఁడ! మహోదయ మందిన వాఁడువోలె బం
గారుకలల్ ఫలించినటుగాఁ దలపోయుచు నుంటి వేమొ నీ
పోరచి యూహ పే రడఁగి పోవఁగఁ గాలను నేలమట్టి గొ
బ్బూరిపడంతి నీ బ్రదుకుబూడిద బుంగల కెత్తకుందునా?

అని యనుకొను చా రేయిని
వనితామణి రాణి కడపె బాధయిడఁ బ్రతి
క్షణ మొక యుగమై యీర్ష్యా
వహ్నిత యగుచు నగ్నిశయ్యపైఁ బొరలినటుల్.

తెల తెల వారుచుండ నరుదెంచిరి జగ్గఁడు పాకరాజు రా
వెలకులజుండు వెంకు రణవీరుఁడు చెంచును మాదినీఁడు కెం
పుల సవరాల గోడిగలు ముట్టిసఁ బాఱు పఠాణి వార్వముల్
కలితటకాటకిధ్వనుల రాణిహజారము చేరి నిల్వఁగన్.

అశ్వముల గిట్టటకటకె లాలకించి
చివ్వనన్ దేఁటివోలెఁ బూసెజ్జలేచి
వారివార్తను బహారామిటారి వచ్చి
మ్రొక్కి తెలుపఁగ బహుళసమ్మోద మొంది.

జిలుఁగుజరీకడానిరవసెల్ల మెయిన్ గయిసేసి గుబ్బలన్
గళుకుఁబసిండికాసెరపికన్ బిగియంగ ధరించి యాదలన్
దళతళలాడు మేల్రవలు తాపిన బంగరు బొమ్మిడీకమున్
నిలిపి పసిండితక్తుఁ గొని సేర్పున వారికి దర్శనమ్మిడెన్.

ఒక్కొ రొక్కరు భక్తితో మ్రొక్కి యవలఁ
గుడిచి కూర్చుండి గొడవలు తడవి తెచ్చి
చంద్రగిరివంక బుద్ధులు సాచి మెల్ల
నందుకొన్నారు వారు రాజ్యప్రసక్తి.

శ్రీరంగప్రభుఁ డెట్లు
ర్వీరఘుణుం డగును వీరవేంకటపతి తా
నేరక యిచ్చినఁ గొనునా;
భీరు వతం డనుచు జగ్గవిభుఁ డుగ్రుండై.

గడె గడె గండమైన బ్రతుకా! మన మిప్పుడ యెత్తిపోయి యా
గడుసరి రంగరాజు కడికండలు చెక్కి సమస్తరాజ్యమున్
బొడువునఁ గొంట లెన్న, యది పోలును బెగ్గడి బిడ్డకై యొకం
డడుగుట వేఱొకం డిడుట యన్నది కన్నది విన్న దున్న దా?

కత్తికి రాచనెత్తురులు గావుగొనంగ నొసంగఁ జేతిలో
సత్తువ గల్గువానికె వశమ్ములు గాని జగమ్ము లూరకే
మెత్తనిపల్కులన్ దరమె మేదిని? రాచఱికంపుగద్దె నీ
పొత్తులబిడ్డ నెక్కుమని పొందునఁ దాన వరించి వచ్చునే?

బలముకొలంది రాజ్యము కృపాణము ప్రాణము దాని కుల్లముల్
పులకరిలంగ శాత్రవుల ముట్టి తదీయ వసామిషార్ద్రముల్
తల లుపహారముల్ నడిపి తద్రిపుజీవము లాహుతించి శాం
తిలఁ గనకున్న నద్ది మరనే తిని కెవ్వాన నార్చకుండునే?

దళములు ప్రోవువడ్డవి కృతాస్త్రములైనవి మాటవెట్టినన్
దొలఁగవు దూకి చంద్రగిరిదుర్గపతాకను నూఁచునంతకున్
నిలువవు గెల్పుకత్తడిని నిల్పక నీ సుతు వట్టిజల్పనల్
సలుపవు రాజఁ డెమ్మనుదొ రాజుతలే బలితేను గోరుదో?

ప్రాణము పందెమిడ్డ బవర మ్మది యిందున గెల్చుకొంటిమా
రాణివి నీవు నీ సుతుఁడు రాజగు నోడితిమా మఱెందు నే
గాణికిఁ జెల్ల వీవు కొడుకా కసవూడ్చిన పెంకుముక్క పిం
గాణికి నేఁ జలామణియుఁ గాఁడు తవాయికి నాన వెట్టుమీ?

ఈ మన మాకరాజు జళిపించిన కత్తికి మాఱుగల్గ దు
ద్దాముఁడు దామినీఁడు సరదా పడి ముందుకు మ్రొగ్గ రంగరాట్
భూమిపు సేనలో మిగిలిపోవున దొక్కటి యుండ దీ జగా
గామిడి వెంకుముందు బ్రిదుకా పగవారికి? నవ్వు వచ్చెడిన్.

మన దళవాయి చెంచె యుఱుమున్ దురమందున యాచముందు ని
ల్చినగద పోరిమాట చెలరేగిన నా యసికంటిలోపలన్
కనకనలాడు నిప్పుకలు గ్రమ్మిననాఁ డిహలోకజీవముల్
మనఁగలనాఁడెగా దురముమాట, సవా లిడ మాటవెట్టుమీ?

ఇలపయి జీవముల్ మొలకలెత్తిన దీ యిహలోక సౌఖ్యముల్
మెలిగొనుచున్ మహోదయ సమృద్ధిని గాంచుటకే, ఫలోదయ
ప్రళయములై తదున్నతికి భంగములే యెసరెత్త వానినిన్
జెలిగి సుధాప్రసిక్తముగ జీవనవల్లిక సాగనీవలెన్.

ఎందఱు లేరు భూభువన మేలిన వారలు, వారిలోన ఈ
చందమె కాక యేర్పడి ప్రజాపరమై చరితార్థమయ్యెనే?
ముందలవట్టి యీడ్చు గడిమ్రుచ్చునకే పడి మ్రొక్కఁగాని యీ
మందజగత్తు మంచికి సముచిత వృత్తిని సాగి పోవునే?

ఎది యెట్టులైనఁ గాని జనియించిన దానికిఁ జేతిలోన బె
ల్లిదముగ నీ యసిన్ బిడికిలించిన దానికి శత్రురక్తముల్
గోదగాని పుక్కిలింప కెటు గొడ్డుగ నీ బ్రదుకీడ్చు టెట్లిఁకన్
బదుగురలోఁ దలెత్తుకొని భంగము లేక చరించు టుర్విపై.

ఓ రాణీ! సకలావనీపతులు 'సాహో' యంచు నీ పల్లకీ
యూరేగింపున ముందు నేగుచు నతైలోద్యన్మణిదీపికల్
తారాజ్యోతులు మాళిదివ్యముకుటాలంకారముక్తామణీ
పూరమ్ముల్ వెలిగింతు రాన యిదుమీ పోరాటకీపూటనే.

అనుచు జగ్గరాయ లత్తు లెత్తులు దోలఁ
గోటిమీసాలందుఁ గ్రూరభావ
ముబుకుచుండ జనితయుద్ధకండూతితో
బాహు వప్పళించి పలుకు నంత.

మొలపిడిబాకు దూసి యిదిపోలు ననెన్ దళవాయి చెంచు, క్రొం
బులకలు మేకొనంగ నిది పోటరి మాటనె మాకరాజు, మా
ర్మలఁగని జోదునోట నిది రావగు ముక్కన దామినీఁ, డజే
యులభుజదర్పలక్ష్మికిది యుంకువ సొమ్మనె వెంకుడగ్రుఁడై.

కలకలనవ్వి రాణి, తెలిగన్నులలో మొలకెత్తి లేఁతవె
న్నెలలతళుక్తళుల్ వెలికి నిల్చి నిమేషములోన నగ్గలన్
దులుపఁగ; నాత్మకోప మట నొఁగలించి కరాళదంష్ట్రికల్
మెలపి ముఖప్రసన్నతను మ్రింగఁగ రక్కసతాల్మి నిట్లనున్.

ఓసరదారులార! తమ కున్న మహోన్నత విక్రమాగ్ని ముం
దీ సకలావనీవలయమే యొక యెండినగడ్డిపోచ, నా
కోసము బద్ధకోస మనుకొన్న యెడన్ బులికోరలన్ మణీ
రాసులు తేఁగలారు జయలక్ష్మిని దెచ్చుట మీకు లెక్కయా?

నిప్పులు చప్పరించుచు ఘుశిల్లు ఘుశిల్లని ఫూత్కరించుచున్
విప్పి ఫణాగ్రముల్ భవదనీకనటత్కరవాలముల్ వృథాపాగ్
మప్పినకీతిఁ దోకల నమాంతము లేచుచుఁ గాటువేయుచో
గుప్పునఁ గూలిపో కౌదిరిగుంపులు కొంపలు సేరఁగల్గునే ;
కదనం ద్రొక్కుచు దూకు మీ కదనకంఖాణాగ్రరింఖాహతిన్
బ్రిదుకుల్ జారఁ గిరీటముల్ దులియ మూర్ధమ్ముల్ గళమ్ముల్ బదా
బదలై పోవ నరాతికిన్ దిరిగి పోవన్ వారి వేళు న్నె ? రా
ట్పదమున్ వీడుటొ ప్రాణమున్ విడుటొ తప్పన్ యుద్ధమధ్యమ్మునన్

అని వచించి రాణి యావేశమున లేచి
తలకిరీట మొరగిల నొఱన్ ని
శాతదీర్ఘఖడ్గసర్పిణిన్ వెలిలాగి
వలికెఁ బులక లలను జలదరించి.

ఒక్కొక కాటు కాటునకు నూపిరిపోక చలించు చుష్ణమా
బొక్కెడు పచ్చిమాంసమును బొక్కెడు చిక్కని పచ్చనెత్తురుల్
చిక్కుట రంగరాయల శరీరములో నెపుడంచు మున్నొఱన్
నిక్కను నీల్గు నీ యసి జనేంద్రసభన్ దఱిగాక నక్కెడిన్.

ఇక్కడ వెలువడినది తన
ముక్కున నావిరియె యున్నఁ బోవ దొఱకుఁ, గ్రొ
వ్వెక్కిన యరిపాల నోటికిఁ
జిక్కుటొ తా నుపవసించి చిక్కుటొ తక్కన్.

అనుచుఁ దనదట్టి వ్రేలాడునట్టి యొఱను
వెలికినిడి దాని ముక్కచెక్కలుగఁ జెక్కి
నిడుదతరవారి నచట గ్రొన్నిగనిగ జిగి
నెసఁగు గద్దియపైఁ బవ్వళింపఁ జేసి.

ఇది యమదంష్ట్రిక రంగని
బ్రదుకునకున్, భావి రక్తపానశ్రమ పో
నిదురించుచున్న దిం దీ
యదనునఁ బనివెట్టి చూత మస్మద్ధీకిన్.

వెరవు ముందునిలిపి వెనుక బలమ్ముంచి
కార్యమునకుఁ గడగుఁ గార్యవాది
భుజబలమ్ము కన్న బుద్ధిబలము మిన్న
గెలుపుకన్నె కన్ను గీటునపుడు.

బహుళ పశుబలమ్ము వ్యయపెట్టు కొనుకంటె
నెఱుక బలిమికొలఁది యెత్తు టొప్పు
వెఱవువలను దగిలి విడువడు టది కల్ల
గోటమీటు పనికి గొడ్డ లేల ?

చంద్రగిరి చమూవ్రజమ్ముతో మనపైకి
రఘువు రేపొ మాపొ రేగవచ్చు
వేగు వచ్చె మనము జాగు పుచ్చక యెత్తు
నెత్త వలయు వైరి చిత్తగాఁగ.

బహిరంగముగ సార్వభౌమాఖ్యతోఁ బ్రజన్
        దోచెడు నొక పెద్దదొంగ యతఁడు
'వారసత్వము' పేర గారడమ్మునఁ బ్రజన్
        డీకొల్పు నొక గారడీఁ డతండు
తడవులనుండి చేపడి తయారుగ నున్న
        పోఁజు గల్గిన బడవా యతండు
కడుపార రాజ్యభోగమ్మారగించుచుఁ
        జెట్టెక్కి కూర్చున్న చెనఁటి యతఁడు
పశుబలమ్మునఁ గోడఁ బరువెత్తినన్ వాఁడు
దొరకునా ? యొకింత దొరకి నంత
కొఱకువడున ? యెదిరి గూటనిద్దుర నున్న
వల నెఱింగి యడప నలయుఁ గాని.

అణఁగి మణంగి చే యందిన దానికే
        తలఁకెడి చిన్నదొంగలము మనము
సత్యార్థమును బ్రతిష్ఠాపింప లేక యా
        రడి పడుచున్న వారలము మనము
డబ్బిచ్చి లాఁతుల నుబ్బించి గుమిగూర్చి
        దుముదారువడు నలంతులము మనము
మలమలలాడు పొట్టలు వట్టికొని దేశ
        ముల వెంట జను పకీరులము మనము

దాడి సేయు టెట్లు దాడిసేయక యెట్లు
బ్రదుకు టెట్లు బ్రదుకు బోయు టెట్లు
లే యుపాయ మిప్పు డెవగించినన్ 'శపీ'
మంచుఁ బడును శత్రు వడలుకొంచు.

అని పలికి రాణి యాలో
చనా కలిత లోచనములు సర్దారుల యా
ననములపైఁ బఱపినయది
మిన మిన మిస మిసని పొదుచు మెఱుపుల పగిదిన్.

అవునిది వాస్తవమ్మని కా మాకరా
 జూహాకై కణతల నొత్తుకొనెను
ఎదిరి బోల్తాగొట్టు టెట్టిలా యని చెంచు
 నొసలు చిట్లించి మిన్ జూడఁ దొడగె
నని లేక జయ మెట్లు లని జగ్గపతి లేచి
 తలవ్రాల్చి వెనుక హస్తములఁ దిరిగె
వెర వేమి యుండుఁ గవ్వించి శతృవుఁ గొట్ట
 కన్న నింకని వెంకు మిన్నకుండె
రక్త కణ మొకండు రాలక జయ మసం
భావ్య మనుచు విసిగ మాదినీడు
ముకుటశిరము హస్తమునఁ బూని రాణి తా
మగ్నయయ్యెఁ దంత్రలగ్న జలధి.

వీరాశ్వటకటకల్ వినిపించునే కాని
మూకనిమెదమున సోకదేమి
కత్తుల తళతళల్ కనిపించునే కాని
చెంచుమేదస్సునఁ జేరదేమి
రక్తసరిత్పంతికల్ ప్రవహించునే కాని
నెగ్గనిబుద్ధికి మ్రొగ్గదేమి
పీనుగుపెంటలు కానవచ్చునె కాని
వెంకుశేముషిఁ జేరి వెలయదేమి
నూఁడిసీనితలను మాంద్యదావేశమ్ము
మలయుఁ బోకచు కాని నిలువదేమి
ప్రణతశీర్ష మింత పైకెత్తఁగా లేదు
కదప లేదు రాణి మెదప లేదు.

మొగిటఁ బ్రసన్నతన్ దళుకుబొందినటుల్ చిఱుముత్తియమ్ములై
పిదపఁ గ్రుధాగ్నిలోఁ బుటము వెట్టినటుల్ నవకెంపుఁగెంపులై
తుదకుఁ దలంపుఁ బెన్నెగలతో నలుపై నటు నీలిరవ్వలై
పొడలెను ఘర్మబిందువులు మోమున నత్తఱి రాణికెంతయున్.

ఉలికిపడి లేచి యూయమ
కలకల నగి పలికె జలదగంభీరముగా
నిలువున వెరవే రూపై
నిలిచినటుల్ రంగరాయనిన్ బట్టినటుల్.

వ్యాఘ్రమును జూచి నరుఁడెంత భయముపడునొ
నరుని జూచి వ్యాఘ్ర మ్మంత పిఱికిపడును
అరికి మనమెంత భయమంద నగునొ మనకు
నరియు లోలోన నంతగా హడలవలయు.

తనగుణములు హితు లెంతగఁ
గొనియాడిన గొప్పగాదు గుణి కా గుణముల్
తనయెదిరి పలికి నప్పుడె
ఘననికషోపలపరీక్ష గలిగి మెరసెడిన్.

రాజ్య మొకటి గొట్టి రాజు తానై చెలా
యించుఁ గాక పంతగించుఁ గాక
యిరుగు పొరుగు దాని గుఱితించి యామోద
మిడక యున్న జేత యడలకున్నె ?

తా నొక సార్వభౌమ బిరు దాంకితుఁడై కకుబంత సద్యశ
స్థానికమైన చంద్రగిరిదుర్గరమన్ బరిణేతృబుద్ధిఁ గై
కో నగుఁ గాక తద్విభుతకున్ మన మొప్పఁగ వద్ద? దానికిన్
దాను సిరంగరాయ లెడఁదన్ సహియించుట కద్ద? యింతకున్.

అది లే దిది లే దిఁక నీ
యద నొక పదనైన కత్తి పగిదిని గొని పొం
దుదయింప రాయబార
మ్మెదిరి కనుప లెస్స యెత్తు కెత్తు ఫలించున్.

అని వచించి యెదుట నాజ్ఞకై వేచిన
కలికిచేత నాకు గంట మటకుఁ
దేరఁబంచి మాకవీరుని గనుసన్న
వ్రాయఁ బూంచి తాను రాణి నుడువు.

శ్రీ మన్మహా సార్వభౌముఁడై నట్టి చం
 ద్రగిరిదుర్గ సమస్తరాజ్య విభుని
చరణమ్ములకు నమస్కారమ్ము లొనరించి
 జగ్గరాట్పుత్రముఖులు సవినయముగ
నంపిన విన్నప మ్మవధారు దేవర !
 నవనీత హృదయ గుణప్రసార!
కకుబంత కామినీ కబరీ మనోహరా
 లంకార గుణభార! రంగరాయ

మేరునగధీర! మీరును మేము పాలు
నీరు వోలెఁ దొల్లిటి వలెఁ జేరి మనికి
పృథ్వి కుపకారము యశఃప్రవృద్ధికరము
కుమతుల యెడంద నిప్పులకుంపటి యగు.

ఓ మా మేటి తెనుంగు మన్నెనర
 దారూ! రంగరాయప్రభూ !
మా మేనుల్ పులకించు మా హృదయముల్
 మాధుర్యమున్ జెందు మా

నోముల్ పండెడి మా మనోరథములున్
బూర్ణంబుగా నిండెడిన్
శ్రీ మన్మంగళమూర్తి వైన నిను
దర్శింపన్ గటాక్షింపుమీ!

చల్లని పాలనమ్ము విరసమ్ములు చల్లని మూర్తి యల్క రా
గిల్లని చూపు లాతితల గిల్లని తూ పధికారితాపద
మ్మల్లనఁ గొన్న నేరు పధికారిత యొల్లని కూరు పింత భూ
వల్లభ నీదుపాదములపైఁ బడఁజేయఁగ లాగు మమ్ములన్.

మా మౌళిన్ భవదాజ్ఞఁ దాల్చెదము
యుష్మచ్చక్రవర్తిత్వమా
యామోదింతుము మీదుచంద్రగిరి
రాజ్యమ్మందు మమ్మెల్లరన్
సామంతప్రభుమండలిన్ గలిపి
కొన్నన్ మీకు మా కుర్వికిన్
క్షేమమ్మా నిది మీర లొప్పినయెడన్
సిద్ధించుఁ బొం దన్నిటన్.

ఈ వచ్చు దూతతో మీ
భావమ్మును బ్రస్ఫుటించి పలికినయెడ మీ
పావనదర్శనమున కు
చ్చావచధోరణికి దిగక సనుదెంతుము వే.

అని లిఖియింపఁ జేసి దరహాసము చేసెను రాణి, మూక రా
జును దనగంటమున్ జెవిని జొన్పి విచారత రాణివంకఁ జూ
చెను, దళవాయి చెంచు నిజ శీర్షము వంచెను, జగ్గరాజు ని
ల్వున వణఁకెన్, దిగాలువడి పోయిరి వెంకును మాదినీఁడునున్.

వారలభావముల్ తెలిసి పక్ష్మలరేఖ నటింపఁజేయుచున్
ధీరత రాణి తా నిశితదృక్కులతోఁ బరిహాసదీపికల్
హారతివెట్టి వారల ముఖాబ్జమలీమసలంబమానదు
ర్వారపరీభవప్రళయరాత్రితమోంధిక జంకఁ గన్గొనెన్.

గుసగుసని వారి చెవులను
ముసిముసి చిఱునవ్వు మొలక మొలవగనూదెన్
ముసిరిన వదనమలీమస
విసరమ్ములు వారి కింక విరియక యున్నే ?

చేయుఁడీ యంచు వారలచేతఁ గమ్మ
పైని జేవ్రాలు చేయించె, బట్టు నొకని
కబురువెట్టి రప్పించె తత్క్షణము దాని
రంగరాయల కనిపె వారంత పొంగి.

ఈ వొక రాజకీయపు టతీంద్రియశక్తిని రూపుదాల్చి మ
మ్మీ విధిఁ గావఁగా నవతరించిన దేవివి గాని కేవల
మ్మీ వొక రాణి వౌదె జననీ! యని మ్రొక్కుచునుండ శాంకరీ
దేవియుఁ బోలె రాణి తన దీర్ఘతరాసిక మెత్తి యిట్లనెన్.

మీ మీ సన్నహానమ్ములఁ
బ్రాహ్మముఖ్యము వడసి వ్యాహారచన జరుపుఁ డు
ద్దామముగ; నాదుసుగుణ
స్తోమస్తుతి కిప్పు డింత చొచ్చుట చాలున్.

వచ్చు చైత్రశుద్ధ పంచమీ గురువార
మీన లగ్న వేళ మించకుండఁ
జంద్రగిరికి మనము జన వలె నని యాన
వెట్టి వీడుకోలు వెట్టె రాణి.

ముహూరా రాధిత రామచంద్ర చరణాంభోజా! కళాసంప దు
ద్వహానోల్లాస వికాస సుప్రథిత విద్యాభోజ! రాజద్యశో
మహనీయా! గణనీయ మంజుల గుణా! మద్దాల శ్రీ రామకృ
ష్ణ! హరిద్వ్యాపిత కావ్యతృష్ణ! బుధరక్షాకృష్ణ! సంపద్వరా!
ధర నొక మేల్మహాలన సుం
దరేందిరా మలయమారుతమహల్ గట్టిం
చి రహించెదు శిల్పకళా
దరమేదుర! రామకృష్ణ ధాత్రీశవరా!

ఇది చతుర్థఖండము.

# చంద్రగిరి దుర్గము

## పంచమ ఖండము.

శ్రీ రమణ ! భూరివితరణ !
చారుకళాభరణ ! సుకవిసత్కృతిశరణా !
దారిద్ర్యహరణచణా కే
ళీరంజచ్చరణ ! రామకృష్ణవరేణ్యా !

అవధరింపుము దేవ ! దయార్ద్రభావ !
కువలయస్యందమాన సద్గుణమరంద !
లలిత కృతికన్యకా లాస్య లస దళింద
మధురదరహాస ! నిత్యసమ్మదవికాస !

అది మధుమాసలక్ష్మియుదయ
ప్రథమాహము కాలవాహినిన్
గదలక మానవుండు బిగఁ
గట్టిన కట్టల ముందుకట్ట భూ

మదవతి ప్రాఁతవేషమును మార్చి
        వినూతనదివ్యవేషమున్
బ్రదుకున వత్సరమ్ము క్రొక
        పట్టునఁ దాల్చెడి పెద్దపండువో.

రంగరా జా రోజు రాణి పంపిన లేఖ
        దూతచేఁ గైకొని దూర మరసి
తనచక్రవర్తిత్వమును జగ్గరాజాదు
        లొప్పుకే నాఁటికి నొప్పు ననుచు
హిత పురోహిత మంత్రి మతుల కిష్టముగ సే
        నానాయకుల యోచ నానురీతి
నాంతరంగిక సభాహర్మ్యమ్ములోన రా
        ద్ధాంతముల్ చూపి సిద్ధాంతపఱచి
వచ్చు చైత్రశుద్ధపంచమీగురువార
మునకు వారిరాక ననుమతించి
బహు బహూపకృతుల వచ్చిన దూతను
సత్కరించి వేడ్క సాగ నంపి.

ఆ వార్తను సామంత ధ
రావరులకు యాచమాదులకుఁ బంపెన్ లే
ఖావాహకులఁ దఱిమి వా
రావేళకు రాక దప్పదని యొక్లేనిన్.

వచ్చెఁ జైత్రశుద్ధ పంచమి, యానాఁడు
రంగరాజు జగ్గరాజునకును
స్వాగత మ్మొసంగ నతిమహావైభవో
పేతరీతి సభను వెలయఁ జేసె.

ఆనాఁటి సభకు సకలో
ర్వీనాథులు గాని మండలేంద్రులు గానీ
రానే రా రొక రసలా
హ్వానము లవి చేరినవియొ వారికి లేదో.

అసువుల కసువుల నర్పించు పెరుమాడి
మండలపతి యాచముండు రాఁడు
శ్రీమన్మహా సార్వభౌముఁ డాప్తుం డైన
రఘునాథ రాయండు రా నెరాఁడు
తన కుడిభుజ మట్లు తనుఁ గాచు జక్కెళ్ల
నరసింగపతియును నరుగు దేఁడు
బ్రదుకెల్లఁ దనకె యర్పణపెట్టు దామెర్ల
చెన్నపనాయండు చేరలేదు
అయ్యనమహేంద్రు జాడ యావంతలేదు
వేంగళోర్వీశు నాశయు విడువఁబడెను
రంగరాయల దండ మాత్రమ్మె యెందుఁ
గంపలంబడ్డ కాకిమై కలఁగి పోవు.

భట్టువార్తను జర్చించుపట్ల వారి
కాంతరంగిక సభకు నాహ్వాన మంప
కుంట రాకుండిరో పంపియున్న నేఁటి
శ్రీముఖమ్ములె వారికిఁ జేరవో మఱి.

కాకిచేత నింత కబురువెట్టినఁ జాలు
వచ్చి యూడిపడెడి ప్రాణహితులు
పగఱతోడి రాయబారమ్ము పట్లను
జిన్నచూపు చూచి చెడఁ దలంత్రో ?

యోజన కందలేదు తమకున్న మహోన్నత కార్యదర్శి కొం
డ్రాజును సర్వసైన్యపతి నారపనాయని బిల్వబంచి ని
ర్వ్యాజకృపా మధుప్రసర రంజిత మంజుల ధీరమంథర
శ్రీజుషులోచనముల్ నిశితదృక్కులు నిల్పుచుఁ దన్ముఖమ్ములన్.

శ్రీముఖమ్ము లెల్లను శిక్షా సేసి సకల
ధారుణీనేతలకుఁ బంపినారో పోయి
నట్టి వార్తాహరులు వచ్చినారో మఱచి
యుండరుగదా వికార్య మూఁకొట్టు మనసు.

నారపనాయఁడా! కదననాట్యము సేయఁగ వేళయైనటుల్
నా రుధిరమ్ములో రణగుణధ్వని బుట్టిన దింక నీవు త
య్యారొనరింపు సేన మన మంపిన లేఖలు యాచమాదులన్
జేరవు శాత్రవుల్ నడుమఁ జేసిన కుట్రలా తేల వింతయున్.

ఓ కొండ్రాజ మహాశయా! జనకతుల్యున్ నిన్నుఁ బ్రార్థించినన్
మాకున్ దప్పక యింతయున్ గలుగ దస్మత్సర్వనాశమ్ములున్
వ్యాకోచించి కవోష్ణరక్తములు ప్రస్యందించు, నీ రాజ్యల
క్ష్మీ స్త్రీ కాంతా శిసు వృద్ధ రక్షణకు నంగీకారమున్ జూపుమీ.

నా కంఠమ్మునఁ బ్రాణముండు వరకున్ రక్షింతు రాజ్యమ్ము నా
కై కన్నీరును నింపవద్దు ప్రజలన్ గాపాడు నాపిమ్మటన్
భూకాంతన్ బ్రజ కొప్పగింపు తుద కీ పుణ్యమ్మునున్ గట్టికో
నీకున్ నా చరమప్రణామ మిదియా నేమో నమస్తే గురూ!

ఓయి నారపనాయఁడా! పోయి ముందు
కోటగనకలు మూయింపు, మోటు దప్పు
నట్టు లదరెడి నాదు వామాక్షి వామ
భుజము లని శ్వసి నెట్టి భూభుజుఁడు పలికె.

విప్పుల బలమును జటికెలో వెంటఁ గొనుచు
వేగ నారపనాయఁడు వెడలి పోయె
స్వాగతసభాంగణము రిచ్చవడుచు నుండ
తేజ ముడిగి కొండ్రాజు పృథ్వీశుఁ గాంచి

ఇంత కంగారువడ నిపు డేల తండ్రి!
అంత ద్రోహమ్ము శత్రువు లాచరింత్రో
రాజనీతికి ధర్మమార్గమ్ము లేదు
ఇంత యూహింప కటు ముఖ లిడఁగ నగునె?

అని కొండ్రాజు వచించుచుండఁ బ్రళయమైనట్లు శ్రీజగ్గరాట్
ఘనసేనానివహమ్ము కోటగవనుల్ గగ్గోలుగా దాటుచున్
జనుదెంచెన్ రిపు నొక్కఁ డడ్డుకొనఁ డానందమ్ముతో స్వాగత
ప్రాంతీభవనమ్ముఁ జూపి మిగులన్ భక్తిన్ బ్రదర్శించెడిన్.

నాదఘనాఢ్యుఁ డయ్యెదనునన్ రణశంఖము పట్టి దుందుభిన్
భోరన మ్రోయఁ జేసి గవనుల్ బిగియింపఁగ నాన పెట్టి యు
ర్వీరమణాంగరక్షకయి వేగఁ దురంగము దెచ్చెఁ బువ్వనన్
వేతాళ వాజి నెక్కి తమ వీరసభాభవనమ్ము చెంతకున్.

అంతకు ముందె జగ్గవిభుఁ డయ్యొడకున్ జనుదెంచి యాత్మదు
ర్గాంత చమూసమూహము ధరాధిపు చుట్టును విచ్చుకత్తులన్
దొంతరఁగట్ట నిల్పి జనుమంతవిధిన్ బయిదాకు నారఘున్
గొంతుకనుత్తరింపఁ బురికొల్పె వెసన్ దళవాయి చెంచునున్.

మాకఁడు మాదిరీఁ దుష్టయుమార్గములన్ దనుఁ గాచియుండ ను
త్సేకత వెంకు వెన్కఁ బటుదీప్తి వెలుంగ మృగేంద్రవాహసీ
భీకరమూర్తియై నడుమ శ్వేతతురంగము మీఁద నుండి యు
ద్రేకిత యాచు రాణి పినరెన్ గరమున్ వెస రాజుఁ బట్టఁగన్.

ముదుకఁడు కొండరాజు మెయి వొంగ విషాదము లేగ రంగరాట్
వదనముఁ జూచి చేని నిరుపాధిక ధీర గభీర భావముం
దొడిగిన నిస్సహాయ రణయోద్ధృతికున్ దలవంచి నుస్సురం
చుదిత విషాద బాష్పముల యోడిక వేడిగ గోట మీటుచున్.

ప్రళయభైరవుఁ డయి పోయి ప్రాంతసైన్య
ములుకులెత్తగఁ గన్నీటి యుదధిలోన
భయదవ బడబాగ్ని జనియింపఁ బార్శ్వ శత్రు
కోటిఁ దనకత్తి నిటు నటుఁ గ్రుమ్మునైచె.

క్రుమ్మిన క్రమ్మితో రిపులు గొల్లన ప్రమాగిరి, వాని శీర్షమున్
డెమ్మని మ్రొంతె వెట్టినది నిల్చి తురంగము మీఁద రాణి, రా
కుమ్మడిఁ గ్రమ్మి శాత్రవులు కొండవిభున్ గబళింపనుండ ఖ
డ్గమ్మును లాగి శత్రుపరికల్పితపంజరరంగరా జనెన్.

ఓ రాణీ! జననీసమానవయి నీ వున్నావు కానన్ వమ
స్కారమ్మున్ బొనరింతు, నా నిశిత ఖడ్గమ్మెత్తగాఁ దాఁచుదున్
మీ రీ వృద్ధుని ముట్టినన్ వినుఁడి యింతే మీరు నే నుర్వికిన్
దూరమ్మాటయథార్థమీవిషయమున్ దూరమ్ము మోచింపుఁడీ.

అని కొండ్రాజు దెసన్ గని
వినయమ్మున నంజలించి వీరరసార్ద్రి
క్తనయనగోళముల ననల
కణములకు బదులు బాష్పకణము లురులఁగన్.

ఓ పూజ్యా! కపటప్రలోభులయి దస్యుల్ వోలెఁ జైనెత్తు ఈ
పాపివ్రాతము చెండి తన్మలిన తీవ్రాస్పృక్కళంకమ్ముగన్
నీ పాణిస్థపవిత్ర దీపిత మహానిస్త్రింశమున్ జేయు వ
ద్దాపోసింపఁగ నెంత? యీ ముఖితికి జీవాంభోధి నీ కృత్తికిన్.

ఏదీ చూఁతును, వీరిలో నెవఁడో జో, దిగ్ధప్రతాపాగ్నికిన్
సాదృశ్యమ్ముగ ముందు వచ్చి యిటఁ గచ్చన్ గట్టరాదా! జయ
ప్రాదుర్భావము రాద! యేవురును బాహాబాహి పోరాడి పో
రాదా! యేలఁగరాద! రాజ్యమిదియేలా వట్టి ప్రాగల్భ్యముల్.

తాతా! వీరలు వట్టి కోచ, లది గాదా వట్టి దొంగల్, ప్రజా
దైతేయుల్, జగమున్ సమూలముగ విధ్వస్తమ్ము గావింప దు
ర్నీతిప్రక్రియ నూహమున్ గొనిన మారిప్రాయు, లేదీ సవాల్
నాతో నీ రిట నేవు రొక్కపటి ద్వంద్వమ్మాడి పోరాదొకో.

అనుచు సవాలు గొట్టుచుఁ దయ్యారయి పోయెను రంగరాయ లా
తని పెనుజబ్బ లుబ్బి భయదమ్మయి పోయెను. జట్టు లుబ్బి పొం
గెను, నిడుతోమ్ము ముందఱకు గెంటుకవచ్చి భయంకరమ్ముగన్
గనఁబడె, మేనుపొంగి మదనాగము పోలికిఁదోఁచె నాఁతఁడున్.

మగఁటిమి రేగి సల్లైగయఁ జూచెను గాని
మాదినీఁ డది యేమొ మలఁగిపోయె
వీరమ్ము పొంగిన ట్లోరచూపును జూచి
వెంకు లోలోపల జంకిపోయె
మగసిరి భగభగ మండి నట్లగపడి
మాకరా జంతలో మణఁగిపోయెఁ
గఱకుఁ గావర ముబ్బి యురికి సల్లైగసియు
జగ్గరాయలదుంత తగ్గిపోయె

కాదేనిన్ భవదీయ దారసుతరక్తమ్మెల్లఁ జిందించి యా
భూదేవిన్ స్నపియింపఁ జేసెదము నిన్ బోరాడియున్ బట్టి త్వ
న్మేదస్సున్ గరగించి ద్రావుదుము దుర్జేయమ్ము మాశక్తి యిం
దేదో నీకుచితమ్ము చూచుకొను మోయీ రంగరాయా! త్వరన్.

అసలు రాజ్యము పూది, కైవసము నయ్యె
వ్యర్థముగ నిప్పు నీతోడ ద్వంద్వమాడ
మాకుఁ బనియేమి? నీ కుటుంబమ్ము బ్రదుక
నభిలషింతో నిరస్త్రిండ వగుము నీవు.

అనినన్ రంగవిభుండు మోసపయిఁ గ్రుద్ధాగ్నిస్ఫులింగావళిన్
దొనఁకన్ దారసుతాసురక్షణాకృపాస్థోరాశి, మంత్రౌషధ
ప్రణిబద్ధాప్రతిమాన సత్త్వయుత హర్యక్షమ్ము పోల్కిన్ ఘనా
ఘన మభ్రంకషవజ్రగర్జ విడి మూగైసట్టులన్ నిల్చి తాన్.

భయదఖడ్గమ్ము నొఱలోసఁ బౌతివెట్టి
పౌరుషజ్వాల తననుండి పాఱనైచు
కొన్న పగిదిని, దానిని గన్నతుదల
నరసి కొండ్రాజు గూడ నిరస్త్రుఁడయ్యె.

మెడదిరుగని గర్వముతో
నుడివిన దా దాణి విభునినోములపంటల్
కొడుకులఁ గూతుల నాలిని
నిడుఁ డని చెఱ నపుడు భటుల నీక్షించి వెనన్.

రాణి కనుసన్నతో భటవ్రాత మప్పుడు
రాణివాసమ్ములోని శ్రీరంగరాట్కు-
టుంబమును దెచ్చి చెఱఁబెట్టె సంబరమున
నతనితోపాటు దుర్గమమ్మైన చోట.

అంతటి మహోన్నతస్థితి కంత హైన్య
దైన్యభరబంధనత్వ, మంతటి నికృష్ట
కష్టసంస్థితి కంత యుత్కృష్ట విభుత,
దానికి నుపాధి ప్రకృతియో దైవమొ మఱి.

రాణికుమారు పేర జయరావము దిక్కులు పిక్కటిల్లె, ని
స్వాణఘణంఘణల్ చెలఁగెఁ, జంద్రగిరిప్రభు రాజమందిరా
స్థాన సువర్ణపీఠపయిఁ జక్కఁగఁ గన్నులు విప్పి చూడఁగన్
లేని కిశోరమూర్తి ప్రజ నేలెడి మన్ననఁ బాలుకాడుచున్.

ఆ మఱునాఁడె పౌక్కె విలయమ్మటు తక్కటు వార్త, సర్వది
గ్భాములు నాఁటి కట్టుడికిపోయెను, శ్రీరఘునాథరాయఁ డు
ద్భ్రాంతిమితుఁ డయ్యె, నయ్యానధరాపతి, వెంగళభర్త, చెన్నప
స్వామియు బేలువోయి, రెవ భగ్గుమనన్ విని యాచమేంద్రుడున్.

భగ్గుమనుటె కాదు పైకొన్న కోపమ్ము
త్రోకఁ ద్రొక్కఁ, లేచి తూఁగి మనసు
బుసలుకొట్టె, నిశిత భూరి కృపాణమ్ము
కుబుస మూడ్చి విసవుఁ గోఱ లెత్తె.

ముప్పదివేల కాల్బలము ముందుకు మ్రొగ్గె, విభగ్న శీర్షమై
రొప్పె ఫణీంద్రుఁ, డుప్పసములో గ్రహమండలతారకల్ గతుల్
తప్పె, నితాంత ఘోర విపదంబుధి వేల గమించి మీఁదికిన్
దెప్పున దూఁకె; రాణి ముఖదీపిక యెఱ్ఱులుదోల నంతటన్:

లేచి సటలు జల్దరిలి నిక్కఁ బొడువంగఁ
కూటనీతిదంష్ట్రి మీటు కొసుచు
జగ్గరాయ లాది సర్దారులను బిల్చి
ఘోరగంట నిప్పు లురలఁ బలికె.

మోజకు యాచముం డెఱుఁగఁబోఁ డెదురెత్తులు తగ్గుమ్రొగ్గలిం
కూరక దూఁకఁజూచుఁ బసదౌర్గ్యతఁ జూచుకొనండు రంగరాట్
భారము పైనివేసికొని పన్నులు దీసెడి, వానికత్తికిన్
మాఱట లేదుపో దురభిమానము పేరిటి భక్తి పెల్లునన్.

కలుగదు నా మెయిన్ బిఱికి
కం డొకటేనియు నగ్గికంటితోఁ
దలపడుఁగాక యీశ్వరుఁడె,
తగ్గదు నా రుధిరమ్ములో లవ
మ్మొలుగునుగాక కాలయముఁ
డంతటివాఁ డొక యింత వేఁడి, యా
ములుచను యాచమున్ దలఁప
ముంచుకొనున్ వడపెల్లు నామెయిన్.

ఈతని యుద్ధృతమ్ము మఱలించినఁ గాని యథార్థ రంగరాట్
జేతృత సిద్ధి వొందదు, దది సేకురగాఁ గదనమ్ము నేఁత కే
పాతర లాడినన్ బ్రదికి బట్ట ధరించున దెవ్వరో, ధరా
నేతృత మీరు నేను మరణించిన వెన్క లభింప నేమగున్.

సామము దానమున్ నడిపి చక్కనయౌనటు చూత మాతఁడు
ద్దామ పరాక్రమప్రళయతాండవ మాడఁగ సిద్ధపడ్డ ఈ
భూమిక వీరరౌద్రరసభూమిక యౌటయుఁ దప్ప దాపయిన్
భూమిని ద్రవ్వి వాహో మనమో తలకెత్తుకొనంగ నయ్యెడిన్.

కోమల మార్గమున్ విడువఁగూడదు, నీతికిఁ బెద్ద యద్ది మా
రాముఁడి వెట్టువాని కొకరవ్వ ధరాస్థలిఁ గత్తిరించి వే
మోమునఁ బొఱవైచి యొకపోల్కని లోఁగొనఁ గల్గి నప్పుడే
భూమిసమస్త మేలు తలపోఁత ఫలించెను నెత్తు కెత్తుగన్.

పూసలలోని దారమటు పూర్వమునుండి నిగూఢమై ధరి
త్రీ సముపన్న జాతిమతరీతి గుణప్రతిపాదనమ్ములో
వేసము మార్చి యార్థిక వివేచనమే నిలఁ ద్రొక్కుకొన్న దీ
యూసు తొలంచిచూడ ననలున్నవె సేవక సేవ్యభావముల్.

ఏదో రీతి గడించికొన్న తమసా త్తైనాఁటికిన్ దగ్గి పో
రాదన్నట్టి సమస్యపై బయలుదేరన్ దీసి రీ స్వామ్యతం
త్రౌదాయ ప్రతిపాదకమ్ములగు 'సత్యం బ్రూహి ధర్మం చరే'
త్యాదుల్ బీదల మూతిచిక్కములు హస్తస్వర్ణశ్రీలాందువుల్.

తాదృక్షమ్మగు ధర్మబోధములు దుస్త్యాజ్యమ్ము లంచున్ మద
శ్రీ దుర్ధర్షు లదృష్ట నాక నరక శ్రీమత్ఫల ప్రాభవ
మ్మాదర్శమ్ముగఁ జూపి నేఁటికి దగా మానంగఁ బో రిట్టి మ
ర్యాదా కల్పిత దైవశక్తి నెవఁ డారాధించుఁ జాఁ గోరికన్.

నా మతమందునన్ నరక నాక ఫలమ్ములు లేవు యజ్ఞ దీ
క్షామల కర్మ లుద్ధమగు సత్యము ధర్మము బూటకమ్ము ని
త్యామర కొక్క శక్తియె మహాభ్యుదయమ్ము, నిరర్థవాద మి
థ్యామతిఁ గాలమున్ జెఱుప నస్తియు నాస్తియు దైవమంచుమనన్.

ఈ సామ్రాజ్యఫలానుభూతికయి నెన్నే నెత్తు పై యెత్తులన్
మోసమ్ముల్ గలకల్పి నైచెన, రిపుప్రోత్తుంగ ధైర్యాద్రి వి
త్రాసిల్లన్ బెకలించి నైచెనఁ, గఠోరప్రాయనై రంగరాట్
నాసాబంధము లుగ్గఁబట్టి పటిమానందమ్ము సంధించెదన్.

యాచమను బాహుశక్తియు సమస్త జగద్బల మొక్క ప్రక్క నా
ధీచతురత్వమున్ గడన దీపితమౌ భవదీయ దృప్త బా
హాచటుల విక్రమమ్ములయునట్టి బలమ్మొక ప్రక్క, నేఁడు రా
జ్యోచిత భూరిభోగు లెవరో మఱి జోగు లెవారో తేలెడిన్.

అరువు దెచ్చుకొన్న యభినివేశమ్ముతోఁ
గడఁగు యాచమేంద్రు గళమునందుఁ
గాన్కఁ జేర యుక్కకాలమ్ము తగిలించి
లాగి పట్టుకున్న రాణి గాను.

అని భట్టున్ వీక్షించి నెయ్యమును దియ్యమ్మైకమై పర్వఁగాఁ
బ్రణాతుల్ ముందుగఁ దేల్పఁగా నుడివి పోరాటమ్ము మాటింతయు
త్తని ధీచాతురిఁ బాటి పొందువడ సంధానింపుమీ యంచుఁ గ
న్గొనలన్ జారెడినవ్వులన్ హసనముసాకూతమ్ముగా నిచ్చుచున్.

తన శ్వేతతురంగమ్మును
బనిగొని తెప్పించి దానిపై మాణిభట్టున్
దనరించి సాగ నంపుచు
మొనయు క్రుధాజ్వాల నణఁచి పొలుపుగ పలుకున్.

ఆతఁడు పట్టి మూర్ఖుఁ, డవు నన్నది కానను, రంగరాజుపైఁ
జేతము మొండు, తప్పిదముఁ జేసిన నాశిష మిచ్చుచుండు, నీ
లో తెలుఁగంగఁ గోరు, ధనలుబ్ధులుగా నిటు దూషఁ,బోరి మా
టే తెగ నెత్తు, సంధి విఘటింపఁగఁ గత్తులఁ గాలు దువ్వెడిన్.

తా నొక సర్వ దిఙ్ముఖరిత ప్రళయోద్ధత నృత్య ధిద్ధ సం
ధ్యా నటభైరవుం డటులఁ దాండవ మాడెను నింక నీవెటుల్
పూనుదువో స్వకార్యము నపూర్వము సుమ్మిది పూవుఁదేనె జా
లై నునుపోగవెన్నెలతళ త్తళలై నుడినేర్పుఁ జూపుమీ.

నీలో రేగెడి విప్లవాగ్నికణముల్ నిద్రింపఁగాఁ జేయు, ము
త్తాలమ్మాన్మ నభిమాన సర్పమును హృన్మంజూష బంధింపు, ము
ద్వేలమ్మాన్మ వచనాబ్ధిభంగములు శాంతిల్లన్ బ్రయత్నింపు, మిం
కేలా నెయ్యము దప్పఁ గయ్యమను మాటే లేక సంధింపుమీ.

అడిగిన సీమలన్ వలయు నంతిడ బల్కుమి రత్నరాసు లే
మడిగిన దెచ్చి కాళ్లకడ నర్పణ పెట్టగ మాట పెట్టు మిం
దొడుదుడు కేమి లేదను మహోదయవాంఛను నర్థరాజ్యమే
యడిగిన సిద్ధమే యను మొ లైన సరే పగఁజాటి రాకుమీ.

ఆనుపాను దెలిసి యాతని ముఖదర్ప
ణమునఁ బ్రతిఫలించు నంశ మెఱిఁగి
యనుము గాని లేఁతదనము నొక్కించుకఁ
దోఁపనీకు బిఱుసు దోఁపనీకు.

అని రాణి సాగనంపుచుఁ
గనుగీటెను జగ్గవిభుని, ఘటకుం డతఁడా
మణిభట్టు వీపుఁ దట్టుచుఁ
బనివినిచెన్ గొంత దవ్వు పనిగొని తానున్.

కవిజలదమయూరా! స
ద్ద్రవిణకుబేరా! వదాన్యతామందారా!
ప్రవిమలకృతిమణిహారా!
యవిరళ మూర్తీభవత్కృపాకారవరా!

కరుణాపాంగ! దయాంతరంగ! సువచో గంగా తరంగా! రమా
వరపాదాంబుజభృంగ! దుర్గుణతమఃపాళీపతంగా! కళా
గురుగంభీరశుభాంగ! పశ్చిమ మహా గోదావరీ వీరవా
సర మద్దాల కులాభిషంగ! జితతృష్ణా! రామకృష్ణప్రభూ!

ఇది పంచమ ఖండము.

# చంద్రగిరిదుర్గము.

## షష్ఠఖండము

శ్రీలలితకళాచార్యా!
కాలుష్య తమో విశోష్యకరసూర్యా! స
త్పాలన హితకార్యా! మ
ద్దాలశ్రీరామకృష్ణ ధాత్రీవర్యా!

అవధరింపుము దేవ! జితారిభావ!
ఆంధ్రకవితా మనోజ్ఞ కర్ణావతంస!
సుప్రతీత పవిత్ర గుణప్రశంస!
సుకవిజలదమయూర! యశోవిహార!

వీరము రౌద్రమున్ గలిసి వెల్లువలై యిరువాగుగా మెయిన్
బాజుకలాడినట్టు ఘనబాహువులు, భక్తిరసమ్ము గడ్డగన్
చేరినయట్టు మిట్టయుర, మైశ్వరసంపదకున్ నిదానమౌ
చేరెడికన్ను, లాతఁ డొక జీవపతాక ప్రతాపలక్ష్మికిన్.

సమవిభక్తమైన సర్వాంగకములందు
నొడ్డు పొడుగు కొలత లిడ్డ యొడలు
పురుషజాతి గొప్పపఱచెడు గుప్పెడు
కోఱమీస లెగసికొన్న మోము.

ఎదుటఁ గనాత్ముఁడోయి పద మెత్తుచు దించెడి మేలిపాఁజుతో
సదమద నగాచుఁ బెన్గరిడిసాలరు రేగిన పాటిదువ్వలో
నుదుటున దూకుచున్ జెలఁగుచుండిన తద్రణయోద్ధచెంతకున్
బదముల నీడ్చుకొంచు మణిభట్టరిగెన్ 'సెలవైన మీఁదటన్'
వంగి జోహారు సేసి యొకప్రక్కగ యాచనరేంద్రు దృష్టికిన్
బ్రుంగుడువాటుగా నిలిచి రుద్ధగళమ్మును గ్రేటి వెండి సా
ష్టాంగము జోతవెట్టి, నిజసైన్యముతోఁ దనపైని నిశ్చలా
పాంగ గభీర దృక్కులను బర్వఁగఁ జేయుచునుండ, నిట్లనెన్.

జగ్గరాజు తాను సాష్టాంగపడి పరి
ష్వంగ మాచరించి భక్తిమెయిని
బలుకు మనిన మనవిపలుకులు తమకు నా
కెలనఁ గలవు చిత్తగింపవలయు.

అవధారు దేవ! యాచమ
భువనపతీ! జగ్గరాజుపలుకులు 'పూర్వత్రాతృ
చ్ఛవి మాయక మీ తేజో
వ్యవసాయమున సుప్రతిష్ఠులై మా కెసఁగున్.

అతుల పరాక్రమమ్మునకు నంకితమైన భవత్కృపాణికిన్
బ్రతి గన, మీ మహాభువన రాజ్యరమా రమణీయవేణికై
నుతిగనఁ దగ్గ, దట్టి యసినోష్ట విరించి లిఖింపఁ జెల్లునే
మతిచెడి యొక్క స్వల్ప పెరుమాడి వధూజటగాఁగ నేఁటికిన్

తెలఁగాజోదులు కమ్మమన్నదొర లుద్దీ లేని మీ వెల్మవీ
రులు రెడ్డిప్రముఖుల్ చతుర్భుజమహాయూపమ్ముతో మా ధరా
లలనన్ బూర్వమునుండి కాచుకొని యారాధింతు రందున్ జగ
మ్ములుఁ గెత్తున్ భవదిద్ధవిక్రమకళల్ హిందోళరాగమ్మునన్.

రాయలనాఁటినుండి నిఖరాం పెనవైచిన స్నేహబంధముల్
పాయవు మీకు మాకుఁ, దమభక్తియు విశ్వసనమ్ము మాకు దీ
ర్ఘాయురనామయప్రదములై హవణించును రక్షరేకు ల,
ట్లే యుపకర్త కేమిడిన నీగును మా ఋణరాశి సాంతమై.

నేఁటికిఁగా శ్రమంపడక నెగ్గెను మీ ప్రభుపట్టి, రంగరా
జోటమిఁ గాంచె, నారసుని నోసరఁ బుచ్చి సమస్తరాజ్యమున్
గోటుగ నేలికోఁగ దొరకొన్న యెడన్ భగవానుఁ డోర్చునే
సాటినృపుల్ భవాదృశులు సైతురె, లో విధిలేక సైచినన్.

ఈ టకటొంకు మీ గెలుఁగ రేమును తత్సభ నాటఁగోలెఁ, బో
రాటము లేక చేపడెను రాజ్యము నేఁ, డిది వీరభోజ్యమై
పాటితదంతిదంతవిభవద్యుతి బోలు కపాలభృజ్జటా
జూటశశాంకసన్నిభయశోగతితో నిఁక వెల్గు మీ కృపన్.

మా దీర్ఘాయువు శిరమున
మీ దీవనఁ బోసి శుభనిమిత్తముగా ని
మ్మేదిని కభిషేకింపుఁడి
దేదో తుది మ్రొక్కు కూడఁ దీరును మీచే.

నేఁటి కదను జిక్కె నెమ్మేనిపై మీకు
వీరగంధ మలఁది వీరభద్ర
పళ్ళెరమ్ము వట్టి వజ్రాల పూజతో
వీరపూజ సేయ విబుధ! మాకు.

సామంతప్రభులందు మేటివయి యస్మద్రాజ్యమం దిచ్చ నీ
వామోదించిన సీమకున్ బ్రభుఁడవై యమ్లానమందారమా
లామాధుర్యముగాఁ ద్వదాజ్ఞ తలఁ దాల్పన్ సర్వరాజన్యు లీ
మా మేనల్లుని కండయై నిలువ సంప్రార్థింతు మెంతే మిమున్.

అని వినిచి ప్రభుల చిత్త
మ్మని కిమ్మన కతఁడు తనదు హస్తమ్ములు మో
డ్చి నిలంబడి యాచమనా
యనిముఖమున దృష్టినిల్పి హడలు నటించున్.

విన్నాఁడు తేనెమాటలు
కన్నాఁ డా లోనివాలకమ్మున విసమున్
దన్నెంత నదుమఁ బైకెగఁ
దన్నుకొనుచుఁ దత్క్రుధాగ్ని తాండవ మాడున్.

కోఱకోఱలాడి భావములు గ్రుడ్లుఱిమెన్, వికటాట్టహాసముల్
మొఱసెను, దంతదంశన సముత్థ పటుస్ఫుట భీకరధ్వనుల్
నెరసె, బదమ్ము లుర్విపయి నిల్వని యిట్టులు లేచి భైరవ
స్ఫురదురు నాట్యముల్ సలిపె,ముచ్చెమటల్ దిగజారె మేనిపై.

ఏమీ జగ్గనిపోకిళుల్! తనకుఁ దానే సర్వసర్వంసహా
స్వామిత్వమ్ము గడించుకొన్న పొగ! రాశ్చర్యమ్ము తద్భీరుఁడే
యీమాటల్ వచియింపఁజాలు మతివాఁడే, సర్వమున్ ధూర్త్తరా
లా మాయావిని యిందదృశ్యయయినాట్యమ్మాడు ముమ్మాటికిన్.

ఎంతటి స్వార్థచింతనమొ యెంతటి రాజ్యవిదాహ తృష్ణయో
గొంతుక లుత్తరించి తనకున్ దలకెత్తుకొనన్ సముద్రప
ర్యంత సమస్తభూవలయరాజ్యము, నింతగ లోక మెల్ల ని
ర్ఘాంతము చెంద, నంతిపురికాంత యొకర్తుక యెంత చేసెడిన్.

ఆతని పేరితో నమృతమాని విసమ్మును బుక్కిలించుచున్
గోతులు దీయ మాకు దొరకొన్నది, యాచముఁ డంత గ్రుడ్డిగా
గోతను గూలువాఁడె, తనగోరిని జగ్గనిగోరి గట్టిదు
ర్నీతికళంకదీప మట నిల్పక సల్పక యంత్యకర్మముల్.

ఈసామ్రాజ్యపుహక్కు భుక్తపడఁ దా నెంతెంతలన్ జేసెనో
దాసీగర్భశిశున్ స్వగర్భజుగ నంతర్నాటకమ్మాడి ధ
ర్మాసీనున్ బతి నంత్యవేళను మఱల్పన్ ధూర్తయై యెంతగా
వ్యాసంగించెనొ సర్వ మీ జగము కొండై కూయదే నేఁటికిన్.

ఔరసుఁడు దాసిపుత్రుఁడ ?
శ్రీరంగప్రభుఁడు నృపకలీనుఁడు తనకున్
దూరాలి దూరగుం డగు
మాఱటకొడుకా? యివెట్టి మఱులో పురులో.

ఆతని కభిషేకమ్మొ
యీతం డొనరించుటా సరే యీ యసిధా
రాతీవ్రాన్పృద్ధారలఁ
బ్రేతపవికిఁ జేయ కతని వీలే నాకున్.

తానంటు వీరపూజయఁట తాడును బొంగర మేని లేని యీ
మానిసి నాకుఁ జేయునఁట మంచిది నమ్మెదు రంగరాయభూ
జానికి, జేషా మాషా చెఱసాలయె పోవని నాఁడు నాకిఁకన్
నేనయి చేసికొంక యెటునిల్తును దద్రుధిరాభితర్పణాన్.

అని పెరుమాడిమండలమహాధిపుఁ డాడినమాట లాత్మకున్
గొనయము వన్ని జివ్వమని గుప్పిసకోలలరీతిఁ దాకఁగాఁ
దనయెదనుండి పైకి నెగదట్టెడి కోపము నుగ్గఁబట్టుచున్
విని మణిభట్టు తాలిమి వివేకముతోఁ బెనవెట్టి పల్కెడిన్.

దేవా! యాగ్రహ ముగ్రమైనఁ దమకున్ దెల్పంగ నే నెంత నన్
మీవాఁడన్న మతిన్ వచింపు మనినన్ మీముందు నాఁగాక, యి
న్నావుల్ నాకు సమాన,మందు ములు ప్రాలన్ జూచు మీవంక, స
ద్భావజ్యోతికి మీదు మూర్తికి నమోవాకమ్ము శాంతింపఁగన్.

వారలు కోడెత్రాచు లటు వర్తిలువా, రేడఁ జూచి రాజ్యమున్
గారడి వన్ని కొట్టికొని కావర మెక్కినవార, లింతలో
దారికి రారు, చేత సరదారులు కల్గిన యంతకాల మిం
తే, రణమన్న నెత్తిపయి కెక్కిన వక్షులు వ్రాల వింతటన్.

మీకుఁ ముప్పదివేల కాల్బలము బ్రహ్మేంద్రాదు లడ్డైన మీ
దూకున్ మాన్పఁగ లేరు, మీరొక రెచాల్ తూర్పారఁబట్టంగ నీ
లోకమ్మెత్తిన, వారికాల్బలమె పేలున్ లక్ష లుండెన్ రణో
ద్రేకుల్ భైరవుఁ డక్షుఁ డడ్డఁ ద్రుటిఁ బట్టిగొట్టి చిత్తయ్యెడిన్.

ఇంతకు రంగరాజు ప్రది కీ వలకున్ బడుటే ప్రధాన, మీ
పంతము గింతమున్ బనికి వచ్చునొ, దానికి ముందు శాంతి మీ
వం తటుపిమ్మటన్ బెనఁగ వచ్చునొ పొందొడఁ గూడవచ్చునో
యంతరమం దెఱింగి తమ రాచరణమ్మునఁ బెట్ట లెస్సయా.

కయ్యము సత్యధర్మముల కై పనిపెట్టిన గీటురాయిగా
నెయ్యెడ వింటి మిందనుక నెచ్చట బొంకులు మోసముల్ దగాల్
నెయ్యము లందుకొన్న వటనే యది వియ్యము నందుచుండె, న
క్షయ్య పరాక్రమమ్ములయు సాహసి కూడ నజయ్యుఁడయ్యెనే.

దేవా! నెత్తుటికూటికి
మీవలనన్ మొనయరాదు, మిథ్యాసుఖద
మ్మీ వసుధాధ్యక్షత్వ
మ్మేవలనన్ గలుగుఁ గాక నేమి ఫలించున్.

శ్రీరంగవిభుఁడు సుగుణ
శ్రీరంగమనస్కుఁ, డింత చెఱుపఁదలఁచు త
త్క్రూరుల కేగతి గలుగునొ
మీ రలుగఁగ నేల? దైవమే కలఁ డరయన్.

పోరికిఁ దెగి పగఁ దీర్పఁగ
మీ రొకరికిఁ బూచిపట్టి మెలఁగుట ధర్మో
దారమ్మె నిఖిలమానవ
భారవహన దీక్ష మీది భగ్నము కాదే.

మీరు తెగించి దూక మిడి మేలఁపుఁ జేష్టల రంగరాయనిన్
గ్రూరులు ద్రుంతురో నిజతనూజకళత్రసబాంధవమ్ముగన్
మారణహోమకుండమున నూ ద్తురో, నేఁటికి బందిగమ్మునన్
దోరుచునుండ్రి జేపటికిఁ దోఁచున దేమొ యనుగ్రహింపుఁడీ!

సెలవైనఁ బోయి వచ్చెద
ములుచల్ల భావమ్ము లెఱిఁగి పొందొడఁగూడన్
దలఁపైన విన్నవించెద
మొలచిన నెఱ సిందు సైఁప మ్రొక్కెద దేవా!

అని మణిభట్టు మ్రొక్కి వినయాంజలి పట్టిన యాచమప్రభుం
డనుపదజాయమాననయనాంచలరోషకషాయదీధితుల్
తొనఁకఁగఁ గుంచితభ్రుకుటి తో నతనిన్ గనియోయి విప్రుఁడా!
చినుకదొ యార్ద్రరక్తకణచిక్కణకాంతి యొకింత నీమెయిన్

దైవము గాని యార్షమతధర్మము గాని యొకింత లేని మా
యావిని వాగురన్ దగిలి యారడి వోయెడి నీకుఁబోలె న
న్నావిలపెట్టఁ జూచెదవె యా పెనురక్కసివాత వీరపూ
జావిషయేచ్ఛ నన్నదుముఁ జిక్కటు లల్లఁగ నేర్చుకొంటివే.

ఇటు వోగడి మమ్ము మెల్లన
నటు వోగడి తత్కర్మమనుచు నాస్తిహితు నటుల్
అటుపై వేదాంతముఁ ద
త్కుటిలతఁ గప్పుటకుఁ జాల దూషించితి విచటన్.

పనివడి ధర్మసంహితలు వల్లన వేసి జితించియున్న నీ
తనువున కీ వృథాకపటదాంభికలౌకికదాస్యవృత్తితో
మనుగడ వెళ్లఁ బోసికొను మాదిరి నీ వెటు మప్పితయ్య! పెం
కెను రణపెంకె నైన నను గిమ్మన నీయవు గుండగొయ్యవై.

నీతో వాద మ్మేలా
నా తుది మాటలను వినుము నాస్తికురా లా
నాతిచెవి కెక్క నాడుమ
యీతఁడు తనవలను దగులఁ డెన్నం డనుచున్.

మా కీ నూతన సిద్ధాం
తీకరణము గిట్ట దెంత తెలిపిన బహుళ
శ్రీకము గోబ్రాహ్మణర
క్షాకము వేదమతమె సమ్మతి మాకున్.

పనవిని వచ్చి యింత శ్రమ పడ్డ ఫల మ్మిది నీకు, రంగరాట్
జనవిభు బందిఁ బాపిన యెడన్ దుద రాణికి మాకుఁ బొందుమా
టనువు పడున్ యథార్థ మనుడా ? మనలో మనమాట రాణికిన్
దనయుఁడు కల్గెనా? యతనిఁ దత్ప్రభు వేల తిరస్కరించెనో.

ఇంతకు రాజ్యకాంక్ష తల కెక్కిన దామెకు దాని కా ధరా
కాంతుని మోసపుచ్చినది కాదనువాఁడన? తద్విభుండు సూ
క్ష్మాంతరవేది రాజ్యము సమస్తముఁ దత్సభ రంగరాయబా
హాంతరసీమ నిల్పి నిఁక హక్కెవరిన్ వరియించెఁ జెప్పుమా!

జగ్గపతి యెవఁడు సిగ్గుం
బొగ్గగు నీ రాయబారమున్ బంపఁగ నా
కగ్గడుసరి పంపుట నే
నగ్గపడు టిదెంత సరస మగునో యనుమీ.

మీరలు బ్రాహ్మణుల్ జనసమీకరణప్రథమాననైపుణో
దారగభీరమానసు లెటాడిన మీ కగు నెట్టి భావము
ర్వారమహాగ్నివిప్లవపరంపర రేపిన మీకె చెల్లుఁ గా
కూరక కత్తివాయి యొడు పూనెడి మా కెటు చెల్లు నన్నిటన్.

ఆస్తికతయె కాని నాస్తిక్యమే కాని
యవని నవతరించు నంత మాత్రఁ
దోలి బహూపకృతిని దోయిలించెడి వాఁడు
పుట్టుచుండు నిన్నుఁ బోలువాఁడు.

మీపని నేఁటికిన్ దొలుత మేయుట లాతిని మేపు టాపయిన్
గోపము కల్గుచో నడఁగఁ గ్రుక్కుట మీరును నక్కుటయ్యె ఈ
పాపము నే సహింప నిఁక వైదికదివ్యదఖండదీపని
ర్వాపణకార్యకర్త లెవ్వరైన బలిచ్చెద నా కృపాణికిన్.

జనిమాత్రమ్మగు జాతిగౌరవము రెచ్చంగొట్టు నుద్బోధముల్
ధనమాత్రమ్మగు వ్యష్టిగౌరవము నిల్వంబెట్టు నాచారముల్
జనసంఘోజ్జ్వలశక్తి సక్రమగతిన్ జాల్వాఱ నీ కడ్డమా
పెనుకట్టల్ శ్రుతిధర్మ నిర్ధారణాసంవిత్ప్రవసంఘట్టముల్.

వాని గూల్చి యార్య వైదిక ధర్మామృ
తప్రవాహ మొడలు తడియఁ బఱపి
సకల మనుజ హృదయ సాంఘికశక్తిని
లేపి రాణి రూపుమాపు వాఁడ.

మెరికలవంటి యీ భుజసమిద్ధ పరాక్రమ వీరకోటులే
దురమున దూకునప్పు డొఱఁదూసిన కత్తులు దింపనప్పు డం
దఱ నొకమాఱు సుట్టి గళనాళములన్ దొలగించి బొబ్బలన్
దఱిమెదు నప్పుడైనఁ దమతప్పిదముల్ కనుగోరొ వారిఁ కన్ఁ

ఓమణిభట్టు! సర్వము సముచ్ఛ్రితమై యిరువాగులన్ బల
మ్మామకొసంగ నిల్వ నెదురైన మదీయకృపాణికిన్ నభో
భూముల మధ్యఁ గందుకము పోలిక జగ్గఁడు శీర్షమొగ్గునాఁ
డీ మిము రాయబారమున కెత్తిన లాభము పొందకుండునే!

ఆశీర్వదింతు నోయీ
నా శిశునకు నాదు మేన నసువులె యున్నన్
ఈశుఁడె తద్దుర్గా
ధీశత్వ మొసంగలేఁడు తెలుపుము దీనిన్.

అని మెల మెల్లన యాచమ
జనపతి యింగలము ద్రింగు సరణిని గోప
మ్మ్రాఁచుకొని గరిడిమల్లురఁ
గనుఁగొనె మణిభట్టులోనఁ గటకటపడుచున్.

ఎంతటి రణపెంకె యితనిలో రాజీకి
వలయు నెత్తుటిచుక్క కలుగ దింత
నార్షధర్మస్తోత్ర మడ్డిడు కొంచు న
న్నెంతగా నితఁడు శపించినైచె
రాజకీయమునందుఁ బ్రబలసాంఘికశక్తి
నుసిఁగొల్పి యెంతగా నురవడించె
నాస్తిక్య మాస్తిక్య మనుటయే కాని యీ
యుభయమ్ము మాటున నుండి వారు
వీరు స్వార్థాభిలాషులై పోరుచుంద్రు
ప్రజల బాగోగు వీరికిఁ బట్టఁగలదొ
యెంచి చూడ మా రాణియే యింత మెఱుఁగు
స్వార్థపరతను బహిరంగపఱచుఁ దనది.

మా రాణితత్త్వమే నా
కారాధ్యము నాస్తికత్వ మగుఁ గా కందున్
బూరాపడఁ దెరు వున్నది
దారె తెలియ దితని గ్రుడ్డి ధర్మజ్యోతిన్.

అంచు మణిభట్టు లో నెంచి యాచమేంద్రు
సెలవు గైకొని యతఁడు చేసిన బహూప
కృతులు గొనక రుషా కషాయిత మనస్కుఁ
డై చనె నని తప్ప దని శ్వేతాశ్వ మెక్కి.

గానములప్రోవు, సత్కళలకున్ నిలయంబు, మహోత్సవాళికిన్
ఘనమగు చేటియూఁత, మృదుకావ్య సుధా లహరీ వినిర్గమం
బున కుపసాధనం బనగ భూరియశస్సు గడించినట్టి స
జ్జననుత! రామకృష్ణవసుధాధిప! భోగజితామరాధిపా!

శ్రీమంజురంజదురుశిం
జామంజీరాంఘ్రివృత్తచణవాణీవీ
ణామృదునిక్వాణితకీ
ర్తీ! మద్దాలరామకృష్ణమధుమూర్తీ!

ఇది షష్ఠ ఖండము

పైఁడిపళ్ళెరముల బంగారునాణెముల్
విలువ కందనట్టి విమలమణులు
తేరఁ బంచి రామదేవరాయల కెత్తు
కెత్తు తూచి చాకి నెలమిఁ జూచి.

కొనుమోయీయివి నీబహూపకృతి మ్రొగ్గున్ వీనికంటెన్, ననున్
నినుఁ బుట్టించిన దైవమైన యిడఁగన్ లేనట్టి నీ దానమున్
గాని మే మీ జడదాన మిత్తుమని సంకోచింపఁగాఁ బోకు, నీ
ఋణమున్ ముంగటిజన్మజన్మములయందేన్ దీర్పయత్నించెదన్.

మా మాకే యమృతంపు టూటయని సంభావించితో బాడబో
ద్భ్రామావర్త సముద్రగర్త మనియే భావించితో నస్మదా
జ్ఞామాలన్ శిరసా వహించితి, ప్రతిజ్ఞాపూర్తికిన్ గుర్తుగా
మా ముందీ చిఱుబిడ్డ నిల్పితి, జగన్మాన్యుండ వో చాకలీ!

ఇప్పటిదాఁక నాహృదయ మెంతో దహించుకపోయె, బొమ్మలన్
నిప్పులకుంప టున్నటు ఘణిల్లని మ్రోగు తుపాకిగుండ్లకున్
ద్రుప్పుడు రాలఁ దూట్లువడి తూలినటుల్ పొరపాటునన్ సఖున్
జప్పునఁ జంపి బాధపడు సద్గుణిమిఃఖసహస్రనస్సటుల్.

అమృతము వోసితి వోయీ
కుమిలెడు మా యెడఁద నెంత కుంఠితమా త్యా
గము రంగ్రాయల రెండవ
కొమరు నితని దెచ్చి మాకుఁ గూర్చితి ప్రియమున్.

అనుచు రజకుని వీఫ్పైపై యాచమ్ముంచు
తట్టి రాజాధిరాజ పాదముల కేని
వంపని శిరస్సు వంచి యా పైడికాన్క
స్వీకరింపఁగ గన్గొనెఁ జాకివాని.

ఏదు సముద్రముల్ కలఁగి శోకముగాఁ బ్రవహించుచున్నవో
యేడును దంత్రు లొక్క మొగి నేడుపు రూఘున నేన్చుచున్నవో
యేడనో లోతులోనఁ గనిపించెడి చిక్కన గుంటకన్నులం
దోడికఁ గట్ట సశుర్ప్రవులు పారోపు నేన్చుచుఁ జాక లిట్లనున్.

బాబూ! ఈ వెలగట్టరాని మణులీ యంగారు నాసొమ్ములున్
నాబోటుల్ గ్రహియింపనౌనె ? యిటులెన్నండైన భావింతునే?
నాబొందిన్ గలయంతకాల మును నీ నాసొమ్ము లే నొల్ల, నీ
మా బాబున్ సరితూచి యిచ్చినవి మన్నాన్యమ్ములై యొప్పినన్.

ఈ మొహరీలవాన సహియింపఁగ లే నొడ లెల్ల నిక్క నా
రోమములన్ని పాములయి రోఁజెను బున్నని, ఈ మణీ ఘృణీ
స్తోమము సోకి నాకనుల చూపణఁగా రెడు గోరుగంట ని
షాక్రమిత కాచబింబములు గాఁ బొనగించి నటుల్ మహాప్రభూ

చెఱుపఁ బోకుఁడు నా యశశ్శ్రీసముద్రి
తచ్ఛటాకాంతు, లెప్పుడో ధరణిఁ జెప్పి
కొనెడి శ్రీరంగరాయల కొమరు నొక్క
చాకి బ్రదికించి కొనెను లంచమ్మటంచు.

మా బాబున్ గొని తెచ్చి నే నిపుడు బ్రహ్మానందసందానిశ
మ్మా బాహుద్వయి కీ మలీమస సువర్ణాకార కాలుష్య చిం
తాబంధమ్మును గూర్చుకో మనసురా, దాబాలగోపాల మీ
నా బంగారుకతన్ సచిత్రరస మానన్ నాకు హాయిందాయగున్.

మీమాటన్ జవదాఁటి నే నెఱుఁగ, భామిర్మ్యమున్నఁబోతిన్, కఠో
రామన్లోగ్ర కరాళ మృత్యుముఖ దంష్ట్రల్ సొచ్చి యెట్లేని గా
నీ మారంగము హేంబ్రము పుత్రకుని దెమ్మిర్మ్యమున్నఁ దోడ్తెచ్చితిన్
స్వామీ! నేఁటికి మీఱితినాఁడ, సహింపన్ రాదొ నన్నింతటన్.

జగ్గరాయ లెప్పు డగ్గికంటను గాచు
రాణి కాళియట్లు గోణి దిరుఁగ
నతనికంట నీరు నామొకంటను నుసల్ప
గొట్టి విజయశుభము మెట్టినాఁడ.

మణిని చేదవాఁడు మసిపాత గొన్నటుల్
గట్టి దొరలనెల్ల బుట్టఁబెట్టి
మైలబుట్టఁ బెట్టి మా బాబుఁ దెచ్చితి
నంతులేని ముదము నాచుకొంటి.

నా యానందములోఁ బా
లీయఁగఁ జాలన్ రవంత యీ తుచ్ఛశిలా
చ్ఛాయల కాశించియు, క్షణి
కాయుష్యములైన సిరుల కాసించియునున్.

అని చివాలునఁ గైవ్రాలె యాచమేంద్రు
పదములన్ వాని నిర్మల భావకలిత
చిత్తవృత్తికి లోన నచ్చెరువు పొంది
యాచముఁడు వానిఁ బైకెత్తి యాదరమున.

నీ యూసంజమములోఁ బ్రా
లీయఁగ వలనోయి నీ సమిద్ధయశశ్శ్రీ
మాయింపఁ జూచె నోయీ
బోయీఁడా! దుఃఖ మింకఁ బోవిడు మోయీ.

పెద్ద విద్దె లెన్ని పేరికిఁ జదివిన
నెన్ని పెద్ద బిఱుదు లున్న నెంత
పెద్దజాతి నుద్భవించిన నిను బోలె
మనుజధర్మ మెవఁడు మనిచినాఁడు.

మానసు బాడ్యుఁడ వోయీ
చాకలి వను మాట ధనవిచక్షణభావుల్
నీకున్ గల్పించిరి బ్రా
హ్మాసల్యాణార్ఘ ధర్మ మిదియే మొదటన్.

అనుచు నతని బరిష్వంగ మాచరించి
యుడు శశి మహార్క.. మండల ముందు దాఁక
తెలిగి పోవని గౌరవశ్రీ నొసంగి
యాచమేంద్రుఁడు చాకలి నంపినాఁడు.

అతఁడు చాకలి కాఁడు కాఁడనఁగఁ దగదు
దేశవిద్రోహశిక్షావిదీర్ణశీర్ణ
హృదయతాపాగ్నిదగ్ధశరీరుఁ డగుచు
రజకుఁడైనట్టి తిరుమలరాయఁ డతఁడు.

అతఁడు చెప్పఁడు యాచముఁడడుగఁ డతనిఁ
జాకి యనియెఁ దలంచె నిజాత్మయందు
కాని యెందుకో వాని యాకారధీర
గురుగభీరోరుగమనమ్ము నరయసాగె.

ఆలోఁ దద్విభుఁ జేరవచ్చి రొడలంతం దల్లకల్లోల ము
ద్వేలమ్మై రుధిరమ్ము జాలువడి బింబింపన్, గపాలాస్థికం
కాలమ్ముల్ ధరియించి వీరరస మాజ్ఞాపూర్తికిన్ వచ్చి న
ట్లోలాగందుచుఁ గొంద ఱుగ్రభటు లాయుశ్శేషులై నాఁటికిన్.

వారిని జూచి కెవ్వుమనెఁ బౌరజన, మ్మడియాసలన్ వృథా
గూరుచు యాచమప్రభుఁడు కొంకుచుఁ 'దెత్తురె రంగరాయలన్
మీ' రని వారిమేనులను మెల్లనఁ దట్టుచు ధౌతవస్త్ర సం
భారము శీతలౌషధ సమన్వితమున్ బనివెట్టె, నంతటన్.

నయనయుగమ్ములో నుడియు
 సంబువులున్ మొయిఁ బొంగి పోవుచున్
రయమునఁ బాఱు నెత్తురి లోక
 రంగయి సారెకు సారె తాకుటన్

మెయిఁగొని యెట్టిఁబాటి మిఱు
        మిన్నొసఁగించెడి కేలు మోడ్చి వి
స్మయపడఁ జూప ఱెల్ల రణ
        మల్లనువాఁడు వచించు యాచమున్.

మీ పాదమ్ములు ముట్టి పల్కెదము స్వామీ! దిగ్జయ స్తంభ ల
క్ష్మీ పూజాకరణప్రతిష్ఠకయి మమ్మీ ముం దనర్హమ్ముగాఁ
గోపుల్ గాయఁగఁ బూన్చినార లిది సిగ్గున్ గూర్చు శ్రీరంగరాట్.
భూపాలాగ్రణిఁ దేని మాబ్రదుకు లుండున్ బోకిటన్ మొండివై.

ఎంత శ్రమమ్ము పొందితిమొ యెవ్వరు చూచిరి, రంగరాయభూ
కాంతుని బంధనాలయముఁ గన్గొని యంతటిదాఁక నేల దు
ర్దాంతకరాసిఁ గ్రొచ్చుచు సొరంగము వేసితి మస్మదీయ మూ
ర్ధాంతరమందుఁ బిట్టపిడుగై దురదృష్టము బ్రద్ద లాయెనో!

చెఱసాల నడిమి కత్తెఱబోను కీల్కవా
        టమ్ములోనికి సొరంగమ్ముఁ దెఱచి
నడురేయి జడములైనన్ నిద్రగొను వేళఁ
        జలిచీమ చావని సరణి వెడలి
పినతండ్రియాజ్ఞ వల్లన వేసికొనుచు, మ
        మ్మును గాంచి యుల్కి, సుప్తోత్థ సింహ
పోతమ్ము సట విప్పు పోలికన్ లేచి, య
        యాచితదైవదత్తానుగతము

గాఢనిద్రా సుఖమ్మును గాంచు నిజకు
టుంబమును గాచుకొనుచు, జీవంబు లేని
పగిది శల్యావశిష్టుఁడై బడలియున్న
ఘనుఁడు శ్రీరంగరాయలు ఖడ్గమెత్తె.

ఎత్తిన లోనఁ దత్తరిలి యేమని శబ్దము సేయరాని నా
కత్తికరమ్ము నాగ నొడికమ్మున గొంతుకుఁ బట్టఁ, గొంద ఱా
క్కత్తుగ దూకి లోన నిదురించెడు కావలికాండ్ర గొంతుక్రోల్
మొత్తగఁ దున్మివైవ, నటమీఁద వచించితి మున్న దున్నటుల్.

కలఁగన్నట్టు సిరంగరాడ్విభుఁడు పూర్కై చూచె, మీ పేరితో
నిలఁద్రొక్కెన్ గొనయూపిరిన్, జటుల నిర్నిద్రాంగ రక్షా మహా
విలయస్థాన, మకాలమృత్యు నట దుర్వృత్తాంఘ్రి ఘంటా ఝుళం
ఝుళ నిష్ప్రాణము బందిఖాన మెటువశ్యమ్మయ్యె మాకంచునున్.

దేవా! త్వరపడ వలె నని
భూవివరము సూపి తెలిపి ప్రొక్కితి మధిక
స్తావికుల మైతి మా పని
కా విభుఁడు తెగింపఁ కిట్టులని తలపోసెన్.

ఈ దురదృష్టు నిం కింతట విడరాదో
యీ భీరుకర్మ కే నెట్లు సొత్తు
మాచమా! నీ కెంత యవ్యాజభక్తి
విశ్వాస మీ ఫల్గురాజన్యుమీఁద,

నిర్భాగ్యదేవతాదుర్భరప్రళయతాం
డవ మహాపాదతాడనల నుస్సి
దులదుల రాలు నా తలను వెండియు నఖం
డిత మణీకలితకోటీర మీవు
నిలుప నెంత తెగించి యత్నించి తయ్యా!
నన్ను బ్రతికించు కొనుదో, నాకన్నతండ్రి
రామదేవరాయలు చాలఁడో, మడియంగ
నిమ్ము నన్ను, లే దిందు లాభమ్ము నీకు.

అయిన, నీవంటి నిశ్చయభక్తివిశ్వాస
పూర్ణుని కాదని పుచ్చు టెట్లు?
మరణించుముందు నామాట దక్కించుకొ
నియె పోవుచును నేను, నీకుఁ దెల్పె
డి కృతజ్ఞతాభార మొక కొంత పరలోక
మందుఁ దగ్గును నాకు, యాచమా! వృ
థా నాకునై నీ ప్రతాపలక్ష్మికిఁ బని
వెట్టి కొనుట, నన్నుఁ బిలుచు చున్న
ది చెయి నూపి విసిఁగి మృత్యుదేవి, పోవ
నిమ్ము నన్, గోపగించును జుమ్ము, తత్క
రాళ వివృతాస్య దంష్ట్రా నిరర్గళోగ్ర
ఘట్టనమ్ముల హాయిగాఁ గరఁగిపోదు.

అని నేత్రపాళి సప్తాంబుధుల్ పొంగ, ఈ
పాడులోకము జోలి పట్టకుండ
గాఢనిద్రాదేవి కౌఁగలింతలఁ జొక్కు-
దారపుత్రులను గన్నారఁ గాంచి,
విపులనిశ్వాసమ్ము వెడలించి, వీరికై
యిట నిల్చి చచ్చి పోవుటయ! కాదు,
ప్రజలకై మనుట నావంటివానికి యుక్త,
మని యాలుబిడ్డల నల్ల నల్లఁ
జరమకృతమై సముద్వేగజనితమై మ
హాబ్ధివలెఁ బొంగి ప్రేమ తొణ్కాడ నొక్క
రొకరి శిరముల మునుఁగుల నొడ్డిగించి
తడవి మాతో సారంగమ్ము దారి వెడలె.

మెలిగొన్న వివరమ్ము తెలఁగక పాము పో
లిక లోని కల్లన డిగ్గి డిగ్గి
పటవాలుగ సాగి సూటిగాఁ బోయిన
గాడిలో జారి యఁంబాడి యాడి
చట్రాలు తగిలిన సందునన్ బోరలు
తాకి చెక్కలు వోవ దేకి దేకి
పాటినేలను ద్రవ్వఁబడ్డ క్రంతను గొంత
శ్రమవోవఁ గూర్చుండి జరిగి జరిగి

ఇంకఁ బది బార లంత క్రమించువేళ
బహుళజన్మపరంపరాపాప మొక్క
మాఱు మాతలన్ బ్రద్దలౌమాడ్కి, విఱిగి
పడె సారంగ మొక్క తలారి పాదహతికి.

ఇంతే యాతఁడు కెవ్వుమం చెగిరి పోయెన్, బొబ్బరించెన్ భయ
భ్రాంతస్వాంత నటు పట్టణంపుదళమెల్లన్, మంటిబెడ్డల్ తలల్
గంతుల్ గట్టఁగ నండ లండలుగ రాలన్ వాని దోర్విపాడి మే
మంతెన్ లేచెడిలోనఁ జుట్టుకొనె మ మ్మాత్మ జగ్గరాట్సైన్యముల్.

ఎంత శ్రమించి యేమిఫల మీ బ్రతుకుల్ భవదీయసేవకున్
గొంతగ నైన నోచుకొన కున్నవి, చేత జివున్నదాఁక నిం
తింతగఁ గండ లీమెయి నసించినదాఁకఁ గచాకచిన్ బరా
క్రాంతిని జూపికొంటిమి నిరర్థక మయ్యె సమస్తమున్ ప్రభూ!

రిత్తచేతులఁ దమ్ము దర్శింపలేక
ధన్యజీవులు కొంద ఱా జన్యభూమిఁ
గన్నుమూసిరి మావంటి కలుషమతులు
కొంద ఱున్నార లది తెల్పుకొఱకుఁ దమకు.

ఊడి పోనున్న జీవమ్ము లుగ్గఁబట్టి
వెంటనే రాక రంగరాడ్విషయ మెఱఁగి
వచ్చినారము తత్పురీవనుల నిల్చి
గ్రుడ్డిలో మెల్ల కొంతకుఁ గొంత నయమె.

రంగవిభుని సపుత్రకళత్రకముగ
రాయవేలూరు దుర్గకారాగృహమ్ము
నందు బంధించి యున్న వారంట మఱలఁ
బెద్దపౌజును గాపలా పెట్టి వారు.

దేవా! సెలవైన యెడన్
బోవుదు ఈ మీాదు లెంకె పుట్టువు ధన్య
మ్మై పోవఁగ ఈ మాటా
పావను గొనివత్తు లేక పడి చత్తు నటన్.

అయిదువందల కాల్బల మై[illegible]కుపదుల
దంతిబలమును రెండువందల తురంగ
బలముగల నా పటాలమ్ము సెలవుపెట్టి
డితని సేవలు మీాకు ఫలించు దేవ!

అని సాష్టాంగము జోతవెట్టి రణవీరావేశుఁడై పొంగి ని
ల్చినయోధున్ రణమల్లుఁజూచి కరుణార్ద్రీభూత మొక్కదృష్టియున్
ఘనవీరోజ్జ్వలదానవపావకసముత్క్రాంతీద్ధ మొక్కదృష్టియై
తొణకంగన్ బెణకంగ యాచముఁడుకుందున్ గందులోలోపలన్.

పొమ్మనఁగ లేఁ డిచటఁ బో
నిమ్మంచు మనంగ లేఁడు నిమిషములో భా
వమ్ము లనేకమ్ము లెదన్
గ్రమ్మ కొనన్ జూచి చూచి కడ కిట్లనియెన్.

రణమల్లూ! నినుమ్రింగి చంద్రగిరిదుర్గ మ్మింతటన్ వెళ్ళఁ గ్రా
సెను జీర్ణించుకొనంగలేక, యిఁక నాచేసేత వేలూరి దు
ర్గ నరాస్రామిషఖాదినీవదనదంష్ట్రాకోటి కెట్టుల్ నినున్
మనసారన్ బలియిత్తు, నీయ కెటు సంభావింతు రంగ్రాజుకై.

నాకున్ బాల్పడ, దున్మదిష్ణు వితఁడన్నా? ప్రేలునేమో యిఁకన్
నీకున్ దోఁచిన రీతిఁ జేయు మిపుడే నీతోడ నీ సర్వసే
నాకోటుల్ కొనిపోదొ నీ దయిన సైన్యమ్మొక్కఁటే కొంచుఁబో
దో కాకున్నొకరుండ వేగుమవో లేకుందో యిటన్ మావలెన్.

నాకు శ్రీరంగవిభుని ప్రాణములతోడ
నెవఁడు చూపింపఁ గలఁడో నా యెదుటఁ బెట్టి
యమ్మహాత్ముని పాదద్వయమ్ము ధూళి
పోవఁ గడిగి మన్మూర్ధాగ్రమున ధరింతు.

అతని పాదోదకమ్ము నే నాచమింతు,
నతని కీ సర్వరాజ్య భూపతిశిరఃకి
రీటమణిమరీచులు నివాళించు, నాతఁ
డగు త్రిభువనీగురుత్వపీఠమ్ము మాకు.

అని వచియింపన్ రణమ
ల్లు నృసింహోగ్రోద్భయంకరుండై తద్యా
చనకేంద్రుని సెలవులు గై
కొని పోయెన్ రంగవిభుని గొనితే వేగన్.

మెరికలవంటి మేల్బిఱుదు కాల్బల మైదు
వందలు వేత్వేఱువడుచుఁ జేర
వినువీధి కెగురు నాశ్వికదళ మ్మొక రెండు
వందలొంటిగ మాటువడుచుఁ జేరఁ
గిరులుదాకి పిఱిందికరుగని హాస్తిక
బలమేఁ బదేకాకివడుచుఁ జేరఁ
దనవంటి యుద్దండరణవీరు లేవురు
పగటివేసము పొందువడుచుఁ జేరఁ
దాను జయధరనామకోద్దండభయద
కదనవేదండ మెక్కి యొక్కండు చేరె
మతగురుని పోల్కి రణమల్లు మాటువడుచు
రాయవేలూ రమావాస్య రాత్రివేళ.

కాటుకముద్ద కార్నలుపు గ్రక్కెడి చీఁకటిలోన, భూమిభృ
త్కూటమువోలె భూగగనగోళము లేకము చేయుచున్, జటా
జూటము విప్పి యా నడుమఁ జొన్పి పురిన్ మృదుఁడేలునట్లు, లా
కోట భయంకరమ్మగుచు గోచరమయ్యెను వారి కెంతయున్.

తజ్జటాజూట పర్యటద్రట దభంగ
భంగ సంఘూత గంగా తరంగిణి వలెఁ
గోటచుట్టును బరిఖ గగ్గోలు రవళి
వారి ధాటిని నాకట్టి పరిహసించు.

అమవసచీకటింట వలె నందఱు నొక్కటఁ జేరి పెల్లు సం
భ్రమితమనస్కులౌచు నలుప్రక్కల కోటను జుట్టి వచ్చి, రా
క్రమణమొనర్ప నెందుఁ గనరా దెగఁ బ్రాకఁగ నింత సందు, కా
లము వృథపుచ్చరాదు మఱలన్ జనరా దిఁకఁ బూనికయెట్టులో.

నలుప్రక్కెడి జాఱుబండలు మలంచి
కట్టఁబడీ యందు నిగిరి పోసట్టి తైల
రాశి పట్టింపఁబడి నట్లరాతివీర
పరమదుర్భేధ్య మగుచుఁ గన్పట్టెఁ గోట.

రణమల్లునేత్రాగ్ని రాజె, బాహులు పొంగె,
నోడ లెల్లఁ బెరిగెఁ, బెల్లుడికె నెత్రు,
లొక్క రొక్కరి చెవి నూదె నేమిటో, కోట
గవను చెంతకు శీఘ్రగతిని జనిరి,
గవనుకావలికాండ్ర కంఠనాళమ్ములు
కిక్కురు మనకుండఁ గెడపినారు,
తత్కవాటము మృత్యు దారుణ వివృత దం
ష్ట్రాంతర్విసారిత జరఠ జిహ్వ
పోలె గుబ్బమేకులతోడ ముందు నిలిచె,
నేన్గుగమితోడ నది యొత్తిగింపఁ బూని,
రొక్క దంతియు ముందుల కొగ్గి దింత,
శూలములబోలు గుబ్బల చుఱుకుఁ దగిలి.

ఉసిగొల్పి పురవడించిరి
ప్రసరించి రొకింత సన్నలన్ మొనయింపన్
గసరిరి దువ్విరి చివరకు
విసిఁగిరి వేసరిరి కలఁగి విరిగిరి వారల్.

ఎటు లీ కోట జయించు, నీ తలుపు లెట్లీ మత్తనాగాళిచే
విటతాట మ్మొనరింపఁజేయు, నెటు లుర్వీభర్తనుం దెచ్చు, టి
చ్చోటుపోనాడి పిఱింది కెట్లు జను,టచ్చోఁ బంతముల్ వల్కి యె
క్కటి నెగ్గించుకొనంగలేని బ్రదుకొక్కం డుండియున్ మండియున్.

అనుచు వారు పరస్పరాస్యములు చూచు
కొనుచుఁ గంపించుచున్నంత, మనసు చెదఱు
పోల్కి రణమల్లు బిరబిరన్ బోయి, తనదు
జయధరాఖ్యాకమత్తగజమ్ముఁ దెచ్చె.

తెచ్చి కోటగవను దెమలింప ముందుకు
జోపె, దానివెనుకఁ జూపెఁ దక్కు
దంతిసమితిఁ, గాని తలుపుగుబ్బలు దాఁకి
జయధరమ్ముగూడ జంకిపోయె.

చిటుకున నేమో తోఁచిన
యటు రణమల్లంత ముందు కరిగి సమీకో
ద్భటులౌ నేవుర సహచర
భటులన్ గని చేరఁ బిలిచి వ్యాహృతిపెట్టెన్.

కిమ్మనరాదు నానుడిని గెంటనురా దిట మీరు నేను బ్రా
ణమ్ముల కాన సేసి పయసమ్మును గట్టను లేదు జేని బం
ధమ్మును బాపుటే మనదుధర్మము, దానికి మీరలున్, గవా
టమ్మున కేను బ్రాణము విడన్వలె, నాపని ముందుఁ దీర్చెదన్.

నాపని ముగిసిన వెంటనె
మీపని ముగియింపవలె సమేయగుణుం డీ
భూపతిని యాచమేంద్రున
మీపమ్మునఁ బెట్టి సుఖము మీరలుకనుఁడీ!

అని కోటతలుపున పెనుగుబ్బ మేకుల
కాని నిలంబడి యాత్మదంతి
కాహ్వాన మొనరించి యావెన్క మత్తేభ
సమితికిఁ బెల్లు హెచ్చరికఁ దెలిపి
యొక్కమాఱుగఁ దల్పు లుచ్చిపోఁ దాఁకఁగ
సన్నలు వెట్టి యాచముని దలఁచి
నిశ్చలస్వాంతుఁడై నిమురుచు దంతిని
హుమ్మనె వెన్క గజమ్ము లొక్క
యూపు నూపెను జయధర మూర్ధ్ని నిలిచి
ముందఱకుఁ ద్రోయ దాతనిముఖముమీఁదఁ
దుండ మొగయించి వెనుకకుఁ ద్రోపులాడు
నెట్టి విడరాని చెలిమొ వా రిరువురకును.

నోరులేనిజంతు వూరక తనుఁజూచి
కనులచెలము లూరి కాల్రఁ గట్టఁ
దుండ మెగయఁబట్టి త్రోపులాడుటఁ జూచి
నోరుగల్గు జంతు వూరడిలక.

వేదండ మెత్తు శుండాదండమును రెండు
కరముల బిగఁబట్టి యురముఁ జేర్చి
దంతమ్ము లోరగాఁ దలఁగి ప్రక్కకు వచ్చి
చెవిదగ్గఱగ మోముఁ జేర్చి పట్టి
యభిమానసంపూరితాక్షిద్వయమునుండి
యొడలిలో రక్త మశ్రూదకముగ
జాల్వార వామహస్తమ్మును వినమిత
దంతికుంభస్థలిఁ దార్చి పట్టి
దక్షిణకరమ్ము తత్ఫాలతలమునందుఁ
గదిపి కంటికి కడివెడు కార్చు దాని
యశ్రుసంసిక్త నేత్రద్వయమ్ముఁ దడవి
గళము నిమురుచు గద్గదకంఠుఁ డగుచు.

ఇది యేమి జయధరా! యీ రోజుతో నింక
నీపేరు నాపేరు మాప నెంచి
నాఁడవటయ్యా! వెన్కంజ వేతువు జంకె
మెఱుఁగని నీకు జం కెవరు నేర్పె

రిది ధర్మమా యాచమేంద్రుని కొల్వులో
నాకుఁ దల్వంపైన నీకుఁ గాదొ
యవమానపడి మను మందువా నాకై వి
లాపింతువేల ధైర్యమ్ము పూని

వీరమరణప్రశస్తికి వీడుకోలొ
సంగుమా! నాకు, నీవు, నే చన్నవెంట
ర మ్మట నెదురుకోల్ స్వాగతమ్ముతోడ
నెదురుచూచెద నిఁక సెలవిమ్ము నాకు.

అని సైగ చేసి హుమ్మనెఁ, గాని తద్దంతి
ముందుల కడుగైన మ్రొగ్గలేదు
రణమల్లు త్రుటిలోనఁ బ్రళయమూర్తుఁడై పోయె
ఓ నోరు వాయియు లేని వట్టి
నీచపశూ! నమ్మి నిన్ సహాయోద్ధ
వం చెంత మోసమ్ము సంగినాఁడఁ
పెద్ద కాయ మ్మింత పెంచుకొన్నంత నే
జంతుజాతికిఁ బరిజ్ఞాన మెట్లు?
పిఱికికండలు తఱిగిపోఁ దరిగి పొమ్ము
నీ మొగమ్మును జూడ జనించుఁ బాప
మంచు నఱచేయి సాచి యా హస్తిగల్ల
మదరిపోవైచెఁ జీకాకు నంది యతఁడు.

ఆ దెబ్బతోఁ దెలివంది నల్లమోఁగు
కొండంత యైపోయెఁ, గుంభయుగళి
మునికాళ్ళపై వంగి రణమల్లు పాదముల్
ముట్టి చివ్వున లేచి మోహరించి
ధూమితవమథునందోహమ్ముతోడ శుం
డాదండ మెత్తి యాపాదమస్త
కమ్ముగా నతని స్నానమ్ము గావించి త
ద్వదననేత్రమ్ములు తడవి చూచి
గళముచుట్టును బరిఁజుట్టి కౌఁగలించి
యతనికర మంది తుది సెల నంది నట్లు
హుమ్మటంచుఁ దదీయవక్షమ్ముమీఁదఁ
గుంభయుగళిని మోపెట్టి క్రమ్మినైచె.

మదమత్తేభము లొక్కటన్ వెనుక హుమ్మంచొత్తి నెట్టెన్ బదా
బదలై కోటకవాటముల్ పెళపెళధ్వానమ్ముతో దవ్వులన్
జిమ్మగై పోయె, నురక్శిరోధమునిమస్తిష్కాస్థిమేదోంత్ర నా
ళదృగాదుల్ రణమల్లుదేహమునఁ జూర్ణమయ్యెఁ బూర్ణమ్ముగన్.

అదరెఁ గోటగోడ బెదరె లోపలివాడ
చెదరె రక్షకాళి యెదిరెఁ బౌఁజు
లది భయంకరమ్ము కదనమ్ము తుములమ్ము
వారొ వీరొ తెలియ లేరెవారు

ఎదిరిన ఫౌఁజుఁ గత్తులనెత్తి టకాటకి నొత్తిగించుచున్
బెబ్బిడి త్రొక్కుకొంచు రణమల్లుఁ డనూనబుద్ధి రార్ద్రిఖండమున్
వారిగజయూథముల్ తురగమండలముల్ ఘనబృంహణమ్ములన్
గుంగఁగ యాచమేంద్రుబలగమ్ము హుటాహుటి నేగె ముందుకున్.

దుర్గవిభుఁడు నిప్పు ద్రొక్కిన మర్కట
మట్లు చిందు ద్రొక్కి యఖిల సేన
మొగ్గరించి నిలుపఁ బూనులోపల దు
ర్గమెల్ల నాక్రమించె నెదిరిసేన.

కోటకవాటముల్ విఱుగఁగొట్టిన సైన్యము లెన్ని వేలకున్
దాటెనొ యొంద ఱిందు సరదారులు నుండిరొ యాచమేంద్రుఁడే
నేటికి వచ్చెనో ప్రళయనృత్యము సేయుచుఁ, జేయిదాటెఁ బో
రాటము, మైక మబ్బె,నిది రాణివినన్ బ్రదు కున్నదే యిఁకన్.

వినకపోదు గెలుపుగొనుట దుర్లభ మామె
యాన గడువరాని దదిఘటింపఁ
గొంత మెచ్చు పుట్టి కొంతకుఁ గొంతైన
బ్రదుకు నిలుపు తనకు మది కరంగు.

అని డేగ యొక్క దానికి
తనజాబు లిఖించి కట్టె తటకిమి భయభ్రాం
తనయుఁడై యొక్కటఁ గి
ష్మన కతఁ డడఁగెన్ రహస్య మందిరమందున్.

ఉద్రేకభరితమై యున్న యాచమసేన
రణమల్లుపేరితో రంకెలిడుచు
నెదురైన ప్రతిసేనఁ జిదిపి కత్తులఁ దచ్చి
రక్తకరోటులు బంతు లాడుకొనుచు
మూలమూలలు సొచ్చి మొనకట్టి దుముదారు
లగుచు నక్కినవారిఁ ద్రెగడికొనుచు
మీ దుర్గనేత యెచ్చో నిల్చెఁ జెప్పుడీ
యని రాజమందిర మ్మడిగికొనుచు
వచ్చి ప్రాణార్తుఁడౌ దుర్గపతిని బట్టి
యెచట శ్రీరంగవిభుఁడు చూపింపు మనుచుఁ
దిట్టి, యతఁడు చూపింపఁ దద్విభు దృశించి
యెత్తికొని పొంగి జయశంఖ మొత్తినారు.

గర్వోన్మత్తులు వారు రంగవిభు వేగన్ గొంచుఁబో కచ్చటన్
నిర్వైరమ్మొనరించుకోఁగ మనసెంతేఁ బుట్టఁగన్ దిగ్జయా
ఖర్వధ్వానము లభ్రమండలము సంఘర్షింప రక్తప్లవ
త్సర్వారాతికళేబరప్రళయనృత్యమ్మాడి రుచ్చండులై.

ఆడి యాడి తుదకు యాచము కావార్త
తెలియఁబంచి తమ్ము నెదురుకొనఁగ,
శీఘ్రగతిని వారు శ్రీరంగవిభుతోడఁ
దిఱుగుఁ బయనమైరి మఱుదినమ్ము.

గుదిగొని వారు కోటగవాసుల్ కడ చేరకె జగ్గఁ డుగ్రుఁడై
మొదిరెను బొబ్బగించె వలయాకృతమైన ఫిరంగిమంటలన్
...పెను, నుగ్గునూచనము చిందరవందరమై బికారమై
...నరెఁ గలంగెఁ బోరిచవదిసెన్ మసియయ్యెను యాచసైన్యముల్.

విజయవార్త యాచవిభునకుఁ జేరనే
లేదు చేరె ముందు రిపుల విజయ
వార్త రంగవిభుని బంది గైకొనిపోయెఁ
జంద్రగిరికి బల్మి జగ్గఁడనుచు.

నాస్తికురాలికి విజయ
మ్మాస్తికునకు నపజయమ్ము నలమెడి మాయా
దుస్తంత్రమనుజశక్తికి
పాస్తి యిడన్ ద్రెుగ్గఁడాయె యాచముఁ డప్పుడున్.

దైవ మూదినిలిచి ధైర్యమ్ముతో ముందు
కడుగు వైవ సుఖము లందవచ్చు
ముందు ముం దటంచు భూరియుద్ధమున కే
యాచమప్రభుండు యత్నపడెను.

తంజాపురాంధ్రమూర్ధాభిషిక్తున కంపె
వీరగంధము నమస్కార పేటి
రక్తాక్షతలు పంపెఁ బ్రాణతుల పొట్లమం
దలరించి యయ్యనధరణిపతికి

జోహారుటోటఁ జొన్పి శూరఖడ్గ మ్మంపె
జిల్లేళ్ల శ్రీనరసింహపతికి
వీరాశిషమ్ము లంపించెను దామెర్ల
సోదరప్రభులకు సూడిదలుగ
రాణి మట్టువెట్టి రంగరాయలఁ దెచ్చి
చంద్రగిరికి మఱల స్వామిఁ జేసి
వీరపూజలొందు వేడుకతో నాఁడు
యాచమప్రభుం డయాచ్యబలుఁడు.

పూచిన కల్పకమ్మువలెఁ, బొంగిన మోదరసాబ్ధి మాదిటిన్,
వీచిన మందగంధవహవీచికరీతిని, దొడ్డినున్న స్వ
ర్ణైచికి పోల్కి, లోకమున రమ్యగుణమ్ముల నొప్పు రామకృ
ష్ణా! చిరభోగభాగ్యవిభవా! కృతవాసర వీరవాసరా!
శ్రీలీలాలాస్యచల
ల్లోలరవల్లలితనూపురోరురవశ్రీ
లాలితమణిశాలా! మ
ద్దాలకులా! రామకృష్ణధరణీపాలా!

ఇది సప్తమ ఖండము.

---

# చంద్రగిరి దుర్గము

## అష్టమ ఖండము

శ్రీ వితరణకంకణశ్రీ
భావిలసితహస్త! సుకవిభాషాభూషా
పావితమస్త! సమస్తో
ర్వీవైభవశస్త! రామకృష్ణవిభువరా!

దేవ! యవధారు సత్కళాదివ్యభావ!
తతమహాపాపగహనసందహనదావ!
సంశ్రితార్థిదుఃఖాబ్ధిసంతరణనావ!
కలితమృదురావ! లోకోపకరణసేవ!

నానావర్ణమతప్రచారదురితాంధద్యోమణీ! దుర్మతి
ప్రాణాహారఫణాధరాసివిసటత్పాణీ! యదృశ్యాత్మతే
జోనిద్రాణధరాసముద్ధరణదీక్షోదగ్రఘోణీ! మహా
రాణీ! మేల్కొనవమ్మమ్రోసెడినిదుర్గద్వారనిస్సాణముల్.

గండాంకాఖిలమండలేశ్వరమనోఖండాగ్ని కాదంబినీ
కాండమ్మై భవదీయహస్తధృతశిత్రాదండ ముప్పార వే
దండద్వంద్వము గంధవారికలశద్వంద్వమ్ము ప్రాజ్యోన్నమ
చ్ఛుండాకాండములన్ ధరించి చనుదెంచున్ లెమ్ము స్నానార్థమై

రాజఖ్యాతిఁ గుమారసూర్యనను పెల్లన్ గొల్లగాఁ గొట్టి ని
ర్వ్యాజుండట్టు వెలుంగుచున్ సకలమాహాత్మ్యప్రథన్ గొన్న చం
ద్రాజున్ నేఁడు వధించి తా నుదయసంధ్యాదేవి మేల్కొల్పెఁ
భ్రాజద్రక్తకరమ్ము లెత్తి సుతునిన్ బాలార్కు లేలెమ్మఁకనీ

జేపెట్టెన్ మునివ్రేళ్లపై నిలిచి ఘంటీభూతరోషమ్ము పై
కేఁపన్ టెక్కలు విచ్చి నిక్కికొని యుద్గ్రీవమ్ముతోఁ గుక్కు
మ్మాపీతారుణమూర్ధముండసద్శిఖామాణిక్య మూఁగన్ భవ
త్కోకపాక్షి ప్రతిమానబింబమటు, మేల్కొమ్మా రాణీ! యింక

కావేర్యంబుతరంగమంజులతురంగానీకముల్ డిగ్గి త్వ
త్సేవాతత్పరు లౌచు దక్షిణసముద్రేశంతు లేతెంచి రా
త్మావాసాగ్రనివిష్టముల్ కనకకుంభమ్ముల్ విపన్నద్యుతి
శ్రీవిభ్రాజితముల్ ధగద్ధగ నిగారించున్ గటాక్షింపుమీ.

శ్రీరాజ్ఞీ! తమకున్ సుగంధకుసుమశ్రీఖండహారిద్రక
ర్పూరజ్యోతిరుదస్తకాంతులు నివాళుల్ వెట్టఁ జారాంగనల్
బారుల్ తీరిన వారు సర్వనృపసామ్రాజ్యాంగనల్ నీ పవి
త్రోరుశ్రీపదసేవకై వెలి నట్లో రాణి! మన్నింపుమీ !

అని వైతాళికవందిమాగధనికరస్యాల్ స్తోత్రపాఠావళుల్
వినుపింపన్ సుమతల్పమున్ డిగి కవేరీస్యకాసీనగం
గంధిబంధామలకోజ్జ్వలాంబువుల స్నానమ్మాడి దివ్యాంశుభూ
షణకోటీరపరిష్కృతుండ్ నెరపి గోషవ్యాసంగసంనష్టుడై.

ఓరీ! యాచమ! యెంతకూళ, విది ప్రత్యుద్దిష్టధర్మమ్ము, చే
లూడన్ దొంగకుదొంగతోడుపడినట్టూహన్ బ్రియుణ్ణింతో, గో
బ్రాహ్మణస్త్రీ యొక వేలగించినవలెం గన్గొనమ్యోనే సీకు, ఈ
పోరాటమ్మున నీవో నేనో నిలుటన్ ముఖ్యంబుఁ దేలన్ వలెన్.

వేలికి వైచినఁ గాలికిఁ
గాలికి వైచినను వ్రేలికా వైతువు మా
జోలి యసలు నీ కేలను
మాలో మేమెందు దూకి మడియుదు మవనిన్.

రామదేవుని రక్షించి రాజ్య మెల్ల
నేలుకొన నీకుఁ దక్కుఁగాఁబోలు, నోరి!
కూళ! వాని, నిన్ బట్టి మీాగుండె లుచ్చి
శోణితముఁ ద్రావకున్న నే రాణి నటర.

అని తలంచి పిలువ నంపించి సోదరు
జగ్గవిభుని వేగ సముఖమునకు
నింతి కాపువెట్టి యేకాంతికపు మంత
నమ్మొనంగి నిశ్చయమ్మొనర్చి.

గండాంకాఖిలమండలేశ్వరమనోఖండాగ్ని కాదంబినీ
కాండమ్మై భవదీయహస్తధృతశిక్షాదండ ముప్పూర వే
దండద్వంద్వము గంధవారికలశద్వంద్వమ్ము పూజోన్నమ
చ్ఛుండాదండములన్ ధరించి చనుదెంచున్ లెమ్ము స్నానార్థమై.

రాజఖ్యాతిఁ గుమారసూర్యవసు వెల్గన్ గొల్లఁగాఁ గొట్టి ని
ర్వ్యాజుండట్టు వెలుంగుచున్ సకలమూరాధ్యప్రథన్ గొన్నత
ద్రాజున్ నేఁడు వధించి తానుదయసంధ్యాదేవి మేల్కొల్పు వి
భ్రాజద్రక్తకరమ్ము లెత్తి సుతునిన్ బాలార్కు లేలెమ్మఁకన్.

జేపెట్టున్ మునివ్రేళ్ళపై నిలిచి పుంజీభూతరోషమ్ము పై
రేఁపన్ ఱెక్కలు విచ్చి నిక్కికొని యుద్గ్రీవమ్ముతోఁ గుక్కుట
మ్మాపీతారుణమూర్ధమండనశిఖామాణిక్య మూఁగన్ భవ
త్కోకపాక్షిప్రతిమానబింబమటు, మేల్కొవమ్మ రాణీ! యిఁకన్.

కావేర్యంబుతరంగమంజులతురంగానీకముల్ డిగ్గి త్వ
త్సేవాతత్పరులౌచు దక్షిణసముద్రేవంతు లేతెంచి రా
త్మావాసాగ్రనివిష్టముల్ కనకకుంభమ్ముల్ వివస్వద్ద్యుతి
శ్రీవిభ్రాజితముల్ ధగద్ధగ నిగారించున్ గటాక్షింపుమీ.

శ్రీరాజ్ఞీ! తమకున్ సుగంధకుసుమశ్రీఖండహారిద్రక
ర్పూరజ్యోతిరుదస్తకాంతులు నివాళుల్ వెట్టఁ బౌరాంగనల్
బారుల్ తీరిన వారు సర్వనృపసామ్రాజ్యాంగనల్ నీ పవి
త్రోరుశ్రీపదసేవకై వెడలినట్లో రాణి! మన్నింపుమీ!

అని వైతాళికవందిమాగధికకన్యల్ స్తోత్రపాఠావళుల్
వినుపింపన్ సుమతల్పమున్ డిగి కవేరీకన్యకానీతగం
ధనిబంధామలకోజ్జ్వలాంబువుల స్నానమ్మాడి దివ్యాంశుభూ
షణకోటీరపరిష్కృతుక్ నెరపి రోషవ్యాలసంనష్టుఁడై.

ఓరీ! యాచమ! యెంతకూళ, విది ప్రత్యుద్దిష్టధర్మమ్మొ, వే
లూరన్ దొంగకుదొంగతోడుపడినట్లూపన్ బ్రయత్నింతొ, గా
బ్బూరిస్త్రీ యొక పేలగింజవలెఁ గన్గొనమ్యోనే నీకు, ఈ
పోరాటమ్మున నీవొ నేనొ నిలుటక్ మున్ముందుఁ దేలన్ వలెన్.

వేలికి వైచినఁ గాలికిఁ
గాలికి వైచినను వ్రేలికా వైతువు మా
జోలి యసలు నీ కేలను
మాలో మేమెందు దూకి మడియుదు మనినన్.

రామదేవుని రక్షించి రాజ్యమెల్ల
నేలుకొన నీకుఁ దక్కుఁ గాఁబోలు, నోరి!
కూళ! వాని, నిన్ బట్టి మీఁగుండె లుచ్చి
శోణితముఁ ద్రావకున్న నే రాణి నటర.

అని తలంచి పిలువ నంపించి సోదరు
జగ్గవిభుని వేగ సముఖమునకు
నింతి కాపువెట్టి యేకాంతికపు మంత
నమ్మొసంగి నిశ్చయమ్మొనర్చి.

యాచముఁ డెంతకైన తగు, నాహవమాడఁగ డొంక, డన్నిటన్
సాచెను బార, లింక రఘునాథుఁడు వహ్నికి గాలి బాసటై
వీచినటుల్ సహాయపడు వీని దురాపదురంతదుష్టపై
శాచికకర్మ కెల్ల; నిటుసాగిన గెల్పునుమాట యున్నదే.

ఇటుఁ గన్నముఁ ద్రవ్వించుట
యట జన్యము సేయఁ బంచుటా, యాచముఁడ
న్నిట సిద్ధపడుట యీ య
న్నిటికి సిరంగవిభు బ్రదుక నిచ్చుటె కాదే.

దూరము పారఁజూచు పని గోఁ బనిలే దిఁక రంగరాయలన్
దారతనూజబంధుసహితమ్ముగఁ జంపినఁ గాని తా నిఁకన్
దారికి రాఁడు యాచముఁడు తైత్రక లాడుట మానఁ డింత యే
లా రణరంగ మాతని గళమ్మున కే యురి త్రాడుగా నగున్.

రంగని పుత్రుని దొంగిలి
యింగితమే లేక చంక లెగనెత్తి కడున్
బొంగెడు నా పొంగెల్లను
గ్రుంగఁ దివియకున్న నింకఁ గోల్కొనఁ గలమే.

బిఱుసేల కూళతో నని
యఱజాతికి రాయబార మంపఁగ నంతం
తొఱ గొడ్డెము లా నోటన
యుఱికెను మనియుండి చచ్చి యుంటిమి మనమున్.

ఇదిగో జగ్గవిభూ ! మనుష్యహృదయమ్మే లేని సైన్యమ్ములన్
బదివేలన్ బనిగొల్పి యాచముని సైన్యవ్రాతమున్ జుట్టి త
ద్భిదురప్రాయభుజోరుపంజరము నిర్భిన్నమ్ము గావించి యం
దోడుగంబాఱిన రామదేవుఁ గొనిరా నొక్కెత్తు శాసింపుమీ.

రామదేవుఁ దెచ్చి రణదేవికిన్ బ్రీతి
బలిడియొసంగ శాంతిపడెదు నామె
యాచముం డికెంత యాచించినన్ గాని
పొంగఁబోన దూఁకొనంగఁ బోదు.

నే నీ లోపల రంగని
ప్రాణానిలపానమునకుఁ బనివెట్టెద నా
యీ నిశితాసికి, నీవో,
యీ నీ కార్యమునకుఁ జనుమీ శీఘ్రమునన్.

అని యతనిఁ బంచి, యాతని
కనుఁజూఁడు చినయోబన్నృపతి నాహ్వానించెన్
మనుజత్వ ముడిగి పోయిన
ఘనుఁ డాతం డెట్టి కార్యకారియుఁ గాడో.

గుండెలు దీసిన మానిసి
గుండాలను బోలు భటుల కొండఱ కతనిన్
దండిమగనిఁ గావించి య
ఖండగతిన్ రంగరాజు కెదికిఁ జనెఁ దాన్.

అది భీకరోగ్ర కారాగార మాకోట
నడుమగా నున్న, దేనాఁటినుండి
యెంత మానవమాంస మెంగిలి పడెనదో,
యెంత రక్త మ్మాస్వదించినదియొ,
తలుపునోటిని విప్పి తన కుక్షి నింపుకే,
వమనమ్ము తన కలవాటు లేదు,
పరిపూర్ణమేధాగ్నిఁ బచనమ్ము కాని మాం
సమ్మెంత తనకు జీర్ణమ్ము కాదు,
సత్యధర్మపరిశంసాప్రశస్తమాంస
మంగిటను వైచి నమలకే మ్రింగివైచు,
నెంత నరమాంసభోజిని యేని తాను
నాస్తికులఁ జూచి గడగడ లాడి పోవు.

దాని గర్భమునందుఁ దారాడు నిపుడు జీ
ర్ణావస్థ సకుటుంబరంగరాజు,
వారిపై నుక్కుఁజువ్వల పెద్దకటాకటా
ల్నడిమిగా నుదయసంధ్యాకృతఘ్న
నెత్తుటిజోతితో నిండారు ప్రత్యగ్ర
రవికిరణాగ్రభల్లముల నెత్తి
మోపెట్టి కసిదీరఁ బొడుచుచున్నది, పాప
మా దైన్యగతికి నహంకరించి

కటకటాల్రొవ్వక్క నుండి పకాపక మని
నవ్వినది రాణి, శ్రీరంగనాథుఁ డద్ది
రోరగంటను గాంచి తలోడ్డిగించి
విపులనిస్పృహనిశ్వాసవీచి విడిచె.

ఓరీ రంగ! తలోడ్డిగించి యటులేమో చూతు, వీ కోటకున్
జోరీ వేసెడి కన్నగానివలె దోఁచున్ నీదువాట, మ్మిఁకో
పాఱుంబోత! యమాలయమ్మునకు నాహ్వానమ్ము నీ కీ భటుల్
తారై తెచ్చిరి, చిత్తగింపు మది ముంద్రాపై భవచ్చిత్త మా.

రంగా! రాజ్యము నాది, నావిభుని దోర్దర్పార్జితమ్మైన, దు
త్తుంగాస్మన్మతి నూర్జితమ్మయిన, దండున్ నీకు వాటా యెటుల్
నింగిన్ నేలయు నేకమా పగిది నన్నే మో దురాశాపరి
ష్వంగన్ గాఁ బ్రవచింత్రు ఘోషలిడి సప్తాంగక్రియా సూత్రముల్.

కూళా! నీవును జాటుకొందు వటు నీకున్ నోరెటుల్ వచ్చు, భూ
పాలుం డియ్యది నాఁడు బుద్ధి పెడత్రోవన్ బట్టి నీ కుత్తుకన్
వ్రేలన్ దీసిన నాగపాశ మగు, దీనిన్ నీదిగాఁ జాటుదో
కాలుష్య మ్మది పోవఁ గత్తిపదనున్ నాకింతు నీ నాలుకన్.

ఎంతటి పొంగు, రాజ్య మిది యెల్ల భుజాపరిరంభణమ్ములో
నింతగఁ జిక్కె నంచు నెగనెత్తుదు చంకలు, దీనికోస మొ
క్కింత యిఁకన్ భుజమ్ము లెగనొత్తుదొ చూడుమనిన్నుఁ గౌఁగలిం
పింతును మింట మంట లెగయించెడి యెఱ్ఱని యుక్కుకంబముల్.

సిందూరారుణకాంతిపూరరుచిరస్మేరానన మ్మిమ్మెయ్యెడన్
గ్రిందై పోవు నదేమి! నీదు జనయిత్రీరాజ్యకాంతాస్య మా
నందోన్మత్తత ముద్దు గొన్న యది ధ్యానమ్మారెం గాంబోల్! విష
స్యందిక్రూరఫణిస్ఫటావళులు ముద్దాడింతుఁ దచ్ఛాంతికై.

కణకణలాడు కరంబులతో కౌఁగిట బట్టెదో, కత్తివాదఱన్
మునికోనెసాలక్కై నాకెదవో, భూరిఫణిస్ఫట ముద్దుగొందువో,
యనూహ్యమొకటించెదు, భూమివలయమ్మున నీవు మనంగరాఁ, దిఁకో
జనపతి! వీరసీమరణశాసనమున్ గొనివచ్చి రియ్యదే.

నాకయి నా సుఖమ్మునకయి నాహృదయప్రళయాగ్ని శాంతికై
నీ కలుషాత్మ పోవవలె నీ తనువెల్లను బూదిగా వలెన్
నీ కులమున్ గుటుంబమును నీల్గవలెన్ ద్రుటిలోన, దీనినిఁ
నీకయి నీవ చేసికొన నేస్తువొ [illegible]మమ్మొసరింపు మందువో.

పలుకుమటో! యని రాణి బహుళనిష్ఠురములు
కటకటాప్రక్కగా గదిమి పలికి
భ్రుకుటులు ముడివైచి వికటాట్టహాసముల్
పొనరించి కనుల నిప్పుకలు చెదరఁ
దన దృష్టి సారించి దారుణాయమకింక
కారక్షకరులైన వీరభటులఁ
చెఱసాల తలుపులు దెరువగా నియమించి
చిరదాస్యనృపతిని జేరఁజేరి

యురుమహోద్దండఖడ్గమ్ము నొఱను వెడలి
యతనిచేతికి నిడి 'స్వామి! యాలసింప
కొక్కత్రుటిని వీనిగుండియ లుచ్చిపోనఁ
బొడిచి త్రాగుమి రక్తముల్ పొట్టనిండ'

అని యురవడించి పంపినఁ
జనె నాతఁడు రక్తపానజనితాభిరుచుల్
కనుగప్ప; వచ్చువానిన్
గని రంగవిభుండు లేచి కలఁ గన్నట్టుల్.

విపులనేత్రద్వయిన్ వెలువడు నిశ్చల
దృక్కుల 'నిలుము! నీ వింక నచట'
యని మేఘమంథరధ్వని ననెఁ, జకితుఁడై
యనుకోని యట్టుల నతఁడు నిలిచె,
నపుడు రంగప్రభుం డాత్మఁ దమాయించి
యను 'నేది నీచేతి యమృతఖడ్గ
మిటు తెమ్ము! మా తల్లి యిడినది యిది కాదె
చరమబహూకృతి నల్పి మాకు,

నింక నీ వేగుమయ్య నీశంక దక్క-
మయ్య! మా యమ్మ యిడిన యనర్ఘఖడ్గ
దానము తిరస్కరింప మా కౌనె? ఆమె
యేది యనుకొన్నఁ జేయంగ లేదొ? మాకు,

అని ముందు కదుగిడి, యట నిశ్చలాశ్చర్య
దిగ్ధుఁడై, తనవంకఁ దెల్ల వోయి
కనుఁగొను చినయోబజనపతిచేతిఖ
డ్గము లాగికొని, వెన్క కల్లనఁ జని
నిరువురఁ బుత్రుల నిరువురఁ గూతులఁ
గన్నారఁ గని, యురస్కంధమందు
వారి శీర్షము లొక్కమాఱుగా నొదిగించు
కొని, లేచి, యాపక్కఁ దనను జూచి
కలఁగి కంటికి కడివెడు కార్చు భార్యఁ
గాంచి, యిదియేమి! శుభవేళఁ గంట నిడుదు
బాష్పములు, నేను మరణింప వలయునంట!
అటు పయిని మీరు, నెంతటి హాయి చావు!

పిచ్చి దానవు దైవ మెచ్చుట లేఁడు, మా
యామేయనరశక్తి కతఁడు లొచ్చు,
తిరిగి మానవజన్మ దొరక దేమో యంచు
భయమందుచుంటివో? వద్దు వద్దు,
దైవభక్తిని నద్ది తలదన్నుఁ గాక ఆ
నరహంతృతాదాత్మ్యభరదురంత
దుర్భరనరజన్మతో మన కికఁ బని
లేనటుల్ చరమాంజలిన్ ఘటింపు

మతివ! యని, యెగశ్వాసతో, ఆమె బాష్ప
సిక్తనయనముల్ తుడిచి సంసిద్ధపఱచి
నిడుదకత్తి నురమ్మునఁ బొడిచి లాగె
వెనుక ముందఱ నెత్రు లువ్వెత్తు నిగిడె.

ఆ రక్తధారఁ దడియుచు
శ్రీరంగవిభుండు కనులఁ జీఁకటు లెసఁగన్
దారాడుచుఁ దన పెద్ద కు
మారున్ నిజకృత్తికిన్ సమర్పణ వెట్టెన్.

ఇపు డాతఁ డున్మత్తుఁ, డెఱుపుఁ బాఱిన నేత్ర
గోళమ్ములన్ కృపాకూశ మిగిరె,
మునివేళ్ళు కొంకరల్ పోవఁగాఁ బుత్రర
క్తప్లావితక్రూరఖడ్గ మెత్తి
తనవంక హృదయనిర్దళనదైన్యవ్యాకు
లాత్ముల నంబువుల్ పాఱుఁ జూడఁ
గనుఁగొను రెండవ తనయుని పసిలేఁత
బొమ్ములో లోతుగాఁ గ్రుమ్మె లాగె
బాలుఁ డదవదలై నేలఁ గూలి పోయెఁ
గ్రింది రక్తప్రవాహమ్ము లేకధాటిఁ
బర్వి పాతాళగంగలోఁ బడెను, మీఁది
ఘనరుధిరధార లాకాశగంగఁ దాకె.

ఆ యురవడి నాతఁడు దై
తేయునివలెఁ బోయి దీనదీనాననయై
కూయిడు జ్యేష్ఠకుమారిక
యాయువులను దీసె నెడఁద నసి గ్రుచ్చి వెసఁ.

కటకటాల్పొందుగా వానిఁ గనుచు రాణి
వికవికా నవ్వె గర్భదుర్భేదనముగ
సరిగ నై దేండ్లు నిండని చంటిబిడ్డ
బెదరి యొడిఁ జేరి యాతండ్రి బిగ్గఁబట్టె.

బిగఁబట్టిన నిసుంగు వీక్షించి వంగని
        నయనాలు చల్లనై ననుపు లూరె,
నలిగి పోయిన జీవనాడులు కంపించె,
        రాణి వేసిన గేలిఱంకె మఱచె,
బెదరిన బిడ్డను బాదివి బాహుల నెత్తి
        యక్కునఁ గుదియించి యదటు మూన
శిరమున శిర ముంచి చేసేత వీపుపై
        జోకొట్టి యుల్లనఁ జుంచు దువ్వి
క్రిందికిన్ దించి చుబుకమ్ముఁ గేలఁ బుణికి
అమ్మ! మన మాలసింపరా దరుగవలయు
అమ్మయు, మఱి అక్కయ్య-లన్నయ్య లంత
ముందుఁ బోయిరి, మనముఁ బోవ వలదె?

అని బుజ్జగించెడి జనకుని గని బిడ్డ
యనును 'నన్నయ్య, లక్కయ్య, లమ్మ
యేలపోయిరి? మన మేల పోవలెఁ దండ్రి?
పోవుట యనఁ గత్తిపోటుచు టగునో!
యటులైన నేను రా; నది చూడ భయమౌను,
నమ్మయు మీరలు నరిగి రండు,
మనము పోయిన వెన్క మన వెంట వీరలు
వత్తురో' యని రాణి వంకఁ జూపె
రాణి పటపటఁ గొంతుకకు పండ్లనియె 'నోసి!
యింత లే వెంత నేర్చితే యీ వయసున!
నఖిల సుఖములు మే మిట నారగింతు,
మటను బనిలేదు మాకు, మీ రరిగి రండు.

బిడ్డమాటకు లోన విపుల నిస్పృహమై డాచు
రాణిమాటకు వ్యథాప్రణీతుఁ డగుచు
రంగరా జనుఁ 'దల్లి! ప్రజల సొత్తెల్లను
దొర యను పేరితో దోచి దోచి
ఆపోశనము పట్టి పాపఫలమ్ము సం
పాదించు కొంటిమి, మా ఫలము నరక
మందుండె, దానికై మన మేఁపవలెఁ గాని
వీర లచ్చోటికి రారు తల్లి!

అంతకంటెను వీర లత్యధికదుఃఖ
నిష్ఠురాఖండకటువిషాగ్నిచ్ఛటాళు
లలము చోటికిఁ జేసువా, రంత ఫలము
వీర లిచట నార్జించుకొన్నారు తల్లి!

ఆ మాట కుటిమి చూచుచు
నేమీ! నీగర్వ మెంత కెత్తిన దారా!
నోరున్ మూయుము, నీపని
పూరింపు, మటంచు రాణి బొబ్బయిడియనెన్.

ఎంత దుశ్చింతాసమీక్ష్యకారిత గల్గి,
వెలి నొండు లోపల వేఱొకండు
వర్తిల్ల, గోముఖవ్యాఘ్రమై, సత్యధ
ర్మాడంబరోరుదంష్ట్రానఖాళి
విప్పి, యమాయికోర్వీప్రజాసంఘుగో
వును మెల మెల్ల గొంతును విదల్చి
యస్రమాంసము లెంత హాయి గ్రోలిన నంత
యతిలౌకికవ్యవహర్త వాఁడు,
నరక మనుమాట కల్ల, స్వర్గనగరిమాట
పొల్లు, నీ విపుడొందెడు భూరిదుఃఖ
మే మహా నరకమ్ము, నే నిపుడు పొందు
సమధికానందమే మహాస్వర్గ మోయి!

అనుభవింపు నరకయాతన, నీ వెంత
యనుభవించుచున్న నంత నేను
ననుభవింతు సమధికానంద నాకసు
ఖమ్ము రంగ! వ్యవధి కలుగనీకు.

అని పల్కి వికటాట్టహాస మొనర్ప నా
తఁడు తదుక్తిజ్వాల కాడికి పోయి
యనుఁ 'దల్లి! నీకత్తి యమదంష్ట్రి మాపాలి,
కెటు పోవ మాకు దా గేది? దేవుఁ
డేడి? నిత్యము తననే నమ్మి సత్యధ
ర్మప్రశస్తికి మేని రక్తమాంస
ములు వ్యయించి శ్రమించి కొలుచు మమ్ముఁ గావ
రాఁడేమి? యిపుడు నీ రాక్షసత్వ
దీర్ఘదంష్ట్రిలు నఱకఁ డదేమి? నీ భ
యంకరతను డింపఁ డిదేమి? యరయ శ్రుతిపు
రాణగాథలు వట్టి కల్పనలు, నాస్తి
దేవుఁ డహాహా! నీ మత మెంత దివ్యమమ్మ!

తల్లి! యిడికెడి నా హృదంతరగభీర
గుప్తభక్తిప్రవిష్టలోకోత్తరుంపు
కలఁడు కలఁ డమ్మ! యతఁడు [illegible]గ్గురుంచు
నమ్ము నామాట నీకు జయమ్ములేదు.'

అని గిరుక్కునఁ దిరిగి బాష్పాంబుధార
లలమఁ గన్నులఁ బసిబిడ్డ నరసి యరసి
వెనుదిరిగి కత్తి భూమి మోపెట్టి వంగి
సత్తువకొలంది వక్షమ్ము నొత్తుకొనెను.

పిడిదాఁక నతఁడు దిగఁబడెఁ
బుడమికి సాష్టాంగపడుచు మొఱయిడినట్లు, లీ
చెడుకర్మ కట్టి కుడుపక
విడుచునొ తత్ప్రేరణాప్రవీణన్ రాణిన్.

ఈ కఱకుఁబిల్ల యొక్కతె
చాఁకే? లరిశేష ముంచఁ జన దెవ్వడు నం
చా కసుగందు గళమ్మున
నా కత్తిని లాగి దింపి యరిగిరి వారల్.

విమలప్రసన్నదృష్టీ!
యమలవచోమధురవృష్టి! యానందకళా
రమణీయహృదయతుష్టీ!
శమదమసంపద్విశిష్టసద్గుణపుష్టీ!

వినయశ్రీ కొక యాలవాల మని యుర్వీదేవిలావణ్యయా
వనసుశ్రీ కొక భూరితృప్తి యని శశ్వత్పాండితీగౌరవ
ప్రణవశ్రీ కొక వేదబుక్కని బుధప్రస్తావనన్ గీర్తిఁ గాం
చిన మద్దాలజరామకృష్ణవసుధాసీమంతినీసద్వారా!

ఇది అష్టమ ఖండము.

# చంద్రగిరిదుర్గము.

## నవమఖండము

శ్రీమత్సుజననమస్యా !
ప్రేమస్మేరాస్య ! సత్కవీంద్రోపాస్యా !
కోమలసముచితహాస్యా !
శ్రీమన్మద్దాలరామకృష్ణమహీశా !
దేవ ! యవధారు, గౌరవశ్రీవిరాజ
మానమద్దాలవంశసంపత్ప్రభావ !
బుల్లితాతయనర్సమాంభోజపదర
జశ్శిరస్సీమ ! సాహితీసార్వభౌమ !
రాణి యెంతటి క్రూరరాక్షసి ! సకుటుంబ
ముగ మ్రింగె నఁట ! రంగభూమివిభుని;
ఆమాట నెత్తకు, నతనికిఁ గల్గిన
భీకరమృతియె ప్రాప్తించు మనకు,

రాణిపై యుద్ధమ్ముఁ బ్రకటించిరఁట ! యాచ<br>
    మేంద్రుండు తంజాపురీశ్వరుండు,<br>
మన కది యేల ? యీ మాట చారులు పొంచి<br>
    తెల్పిన నేఁటితోఁ దీరు మనకు,<br>
వార లిర్వురె యేకమై పోరు నెడల<br>
రామదేవుండు తప్ప కీ రాజ్యమునకు<br>
నొడయఁ డవ్వాఁడు, నేల యీగొడవ లెత్తి<br>
కొంపపైకి వృథా తెచ్చుకొందురయ్య !

అని మూలమూల లందున<br>
నణఁగి, ప్రపంచమ్ము సర్వ మట్టుఘుకుగతిన్<br>
జను లాడుకొనుచుఁ దమ రవి<br>
వినీవినని యట్టు పైకి విహరింత్రు వెలిన్.

నిలువునఁ బ్రాణముల్ బలిగొన్నదఁట! రాణి,<br>
    వింటిరే ! రంగరాడ్విభుకుటుంబ<br>
దుర్గతి ; యెంతటి ధూర్తత్వ ముండిన<br>
    నింతటి క్రౌర్యోగ్రహింస తగదు ;<br>
రంగరాడ్విభు శిశుని రక్త మానిన కత్తి<br>
    మనరక్త మ్మానక చనునె చెప్పు ?<br>
నాస్తికురాలికి నరమాంస ఖింతఢాఁ<br>
    జవియైన దటా ! యింక జగము మనునె ?

యనుచు లోలోన పాడలెత్తి, యాస్తికప్ర
బుద్ధు లుద్బోధచేసి, ప్రభుత్వమందుఁ
జీతికల్లు వెట్టి, యతిరహస్యైకృత్యోడు
విప్లవానలబీజములన్ విత్తినారు.

ఉగ్రుఁడై యాచముం బుద్బోధ లొనరించెఁ,
    బాడయ్యె శ్రుతిధర్మపాఠనములు,
ధర్మార్జనోపాయతాత్త్వికచింతన
    మ్మడుఁగంటె, వ్రతరహస్యమ్ము సమసె,
జపతపఃపద్ధతి యుపరతమ్మయ్యె, స్వ
    ర్గాభిసంగమకమార్గమ్ము చెడియె
సారూప్యసాయుజ్యసోఽహమస్మ్యాదిమో
    క్షప్రాప్తియుక్తి ధ్వంసమ్ము నయ్యె,
ఆస్తికులు చచ్చుటాయెను, నాస్తికాళి
హెచ్చుటాయె నీ రాణి పాపేచ్ఛకొఱకు,
ఇది పవిత్రకర్మక్షేత్ర, మెటు సహింప
నౌను! దుర్భరమర్మవహ్నిమ్ము నీమె.

ఉఱుకుఁడు తెన్గుఁగత్తులకు హోళిగ నేయుఁడు రాణియాయువుల్,
తఱుగుఁడు సన్నసన్నముగఁ దగ్గని జగ్గని మేనికండలన్,
నుఱుముఁడు నాస్తికప్రవచనోగ్రముఖమ్ములు, తెన్గునెత్తుటన్
బెరిగిన మ్లాన లూదక విభీతికి దోసిళ్లు లొగ్గఁ జెల్లునే?

బంగరువంటి వైదికము భస్మముచేసి తదంగరక్షకున్
రంగవిభున్ బవిత్రుని గళత్రతనూజయుతమ్ముగా మహా
త్తుంగదవార్చి కావులిడి దొంగలు పొంగెదరయ్య! నాస్తికుల్
వంగినవో తెనుంగుబిడిబాకులు మీ కుడిచేతినాలికల్.

అమృతమువంటి తీయనగు నార్షమతోక్తికళాస్రవంతిలోఁ
గుమతులు నాస్తికుల్ హలితభుగుగ్రవిషమ్మును గ్రుమ్మరింపఁగా
సమకొని, రీ దురంత మిటు సాగఁగ నిచ్చినఁ దెగ్గఁబుట్టువుల్
సమయవె? దూయుఁడీ విమతరక్తపరాయణముల్ కృపాణముల్.

లెండో తెల్గుమగంటిమిన్ జవ్వు నూరింపంగ వేళయ్యె, మీ
యండన్ నిల్చెను వేదధర్మ, మిపు డాస్య మ్మెత్తకున్నన్ మఱె
వ్వండో యీమన తెన్గుదేశమున కౌన్నత్యమ్ము? లెండయ్య! యు
ద్దండారాధనయోధమూర్తులయి తజ్జగ్గాహి నుగ్గాడఁగన్.

రండో యింకఁ దయూరు భూభుపసచక్రస్వామ్య మెవ్వారి దో
ర్దండోన్మండితమో వినిర్ణయ మొనర్పన్ వేళ యేతెంచె, బ్ర
హ్మాండమ్మం తొక చక్కిలమ్ముగ గ్రసింపన్ బాలుపడ్డట్టి యు
చ్చండస్వామిని రాణికోటలఁ బెకల్చన్ గాలమున్ డగ్గఱెన్.

రండో తొల్లిటి తెల్గునాయకుల వీరావేశసంపత్తికిన్
గుండెల్ కానుక లిచ్చి యొక్కటయి చేకోఁబూర్వికౌన్నత్య, ము
ద్దండుల్ మీరలు నిల్చినన్ మునుమునన్ దా మెంత? నాస్తిక్యమెం?
కొండల్ గూలిన యట్లు కూలుదురు జగ్గాద్యుగ్రదైత్యాధముల్.

గండుంబారుమగంటిమింగల తెలంగాజోదులారా! యశో
డిండీరమ్ములు వేయుఁడీ! దశదిశాలేలిహ్యమానోజ్జ్వలా
ఖండధ్వానములన్ ధమాధమితఢంకారమ్ములన్ నేఁడు వే
ఢోండమ్మ్రోల్లను మాఱుమ్రోఁగి హడలెత్తన్ రాణి నిర్వాణియై.

అనుచు నుద్బోధించి యఖిలప్రపంచ మొ
క్కూఁపూపై యాచముం డుత్తరంగ
రంగత్తరంగిణీసంగతోత్తుంగాబ్ధి
కుంఠగర్జాభంగిఁ గంఠమెత్తి,
యార్ష ధర్మప్రధానానుయాయివ్రజ
మ్మాగర్భలక్ష్మీకుమారసమితి
యంగమ్ము లుప్పొంగ యాచమున్ జేరె, సు
ప్పదివేలఫౌఁజు ప్రోవయ్యె, నంత
దండు సాటింపఁజేసి ప్రస్థానభేరి
వైచి, తంజాపురమ్మును వదలి యెదురు
వచ్చు రఘునాథరాయలబలముఁ గలియ
నడిపెఁ దన సేన కుంభకోణమ్ముదిక్కు.

యాచమోగ్రభయంకరార్భటి విని రాణి
జృంభించి యుద్బోధ చేయ సాగె,
దైవమ్ముపేరఁ బెనదబ్బరల్ చెలరేఁగఁ
గర్మపేరను డాంబికమ్ము రేఁగ

సకలశాఖోన్మృత్యవికటాట్టహాసమ్ము
మహితమాయాగుహాన్ మాఱుమ్రోఁగఁ
బరలోకపుణ్యపాపప్రలాపస్వార్థ
తత్పరత్వపిశాచతాండవమ్ము
లుర్వి కంపించి పోవ నుఱ్ఱూఁతలూఁగ
కల్పితస్వర్గనరకలోకములు చూపి
స్వీయధనరక్షణోపాయమాయ యనెడి
మతము పేరిటి గజదొంగ బ్రతుకసాఁగె.

ఏ యమంగళవేళ నీ ద్రావిడుల నెత్తి
నడుగువెట్టెనో వైదికార్య మతము
ఏ దుర్దినమునందు నీ ద్రావిడులకొంప
లంటించెనో వైదికాగ్నికీల
ఏ దుర్ముహూర్తాన నీ ద్రావిడులనోరు
నొక్కెనో వైదికాన్యాయశక్తి
ఏ యరిష్టదినాన నీ ద్రావిడులసిరుల్
హరియించెనో వైదికార్థశఠుఁడు
[illegible]కిఁ దలెత్తుకొనలేక నిలువనీడ
నోర్విప్పలేక దరిద్రమయ్యె
[illegible]డాంధ్ర మహాసామ్రాజ్యప్రశస్త,
[illegible] సహించుట ? సవనగోహింసకర్మ.

ఔనటో! పాషండుడ త్తినాస్తిమతాల
కావల వెలసిన యమృతమూర్తి
పతితుఁడా? సవసగోవధకర్మ ఖండించి
కరుణాళు వైనట్టి నిర్మయోగి
అస్పాఁడా! విశ్వవిశ్వాఖండపావనా
సంసప్రిముఁడు శాపనార్థములకుఁ
దగఁడటో? సత్యధర్మాహింసలకు వాహా
నమ్మైన ముని బ్రాహ్మణార్థములకు
నెంత ఘోరము! లోక మహింస యనెడి
దైవమును వీడి యెచటికో దైవముకయి
పోవుచుండెను స్మృతుల ననుభూతకల్ప
నాస్పదమ్మగు జగతియుట్టము గుదారి,

దైవము దైవ మును చరచి దబ్బులాడఁగ జెల్లునే? జగ
త్సేవకు మించి దైవ మెటఁ జింపులుఁ ద్రొక్కుము, నీకు నాకు లో
కావనశక్తిమాత్ర మొకటన్నిట వెల్గును, గాని నీవలెన్
జీవుఁడు శాశ్వతుండను విశిష్టత కొప్పను మించి గాలికిన్.

జన్మింతువా? లోకజననకారణబీజ
భూమియూ మాతల్లి భూమి మించి
జీవింతువా? జగచ్చేతనాకారి యూ
యురుజీవదాత వాయువును మింగి

బ్రదుకూనుదువ? కృపారసరూపి మా చల్ల
 నగు తండ్రి జలదేవు నవఘళించి
పలుకైననాడుదో? బహువిధశబ్దర
 మ్యయగు మా జనని వియత్తు వదలి
వెలయుదువో! లోకకల్యాణలలితమూర్తి
బహుపవిత్రుఁడు మాతండ్రి జ్వాలను వీడి
తెలుపుమో రిక్తకల్పితదేవపాద
పూజకా! పాంచభౌతికమూలపురుష!

నరకము నాక మందువు కనంబడ వవ్వి, పురాజనుఃపరం
పర యని పుణ్యపాప మని పల్కెదు వానికిఁ దావు లేదు, దు
ర్భరమగు కర్మ యందు వది పచ్చియబద్ధము, వీనికెల్లఁ బై
దొరగను దైవమున్ నిలిపి దొంగగ దోచెదు విశ్వవిశ్వమున్.

పెళపెళార్భటి రేగి పెట్లిపోయెడి విద్యు
 దావేశితాగ్నిగ్రహాలతోడఁ
గరఁగు లోహద్రవ మ్మురవడింపఁగ భ్రమ
 ద్భ్రమితమ్ములౌ నెబ్యులాలతోడ
నిప్పులవాయువుల్ నిగిడి వీవఁగ భగా
 భగమందు తారకాప్రతతితోడ
నగ్నిజిహ్వలు సాచి యన్యగోళములపైఁ
 బడుచుండు నక్షత్రపంక్తితోడ

కుందు లేకుండ నిండి జ్వాజ్వల్యమాన
గమనవిరతాగ్నికుండమా గగనమందు
నీ పురాణేతిహాసకథాపునీత
దివిజభూములు నిలిచిన దేశ మెచట?

అని రాణి సమస్తోర్విని
ఘనపటహధ్వాన ముఖరఁగాఁ జాటింపిం
చెను; వట్టి యమాయిక
జనసంఘము రెచ్చి యామె సేనఁ మాఱెన్.

ఖండీరమండలాఖండలుం డనఁగఁ బే
రందిన ముద్దుకృష్ణప్పవిభుఁడు
పాండ్యమండలమహాప్రభువనన్ బ్రఖ్యాతి
నందిన మధురవీరప్పఱేఁడు
సామంతవిభులలోఁ జాలఁ గీర్తిని గొన్న
దిట్ట నాపిళ్ళతిత్తిప్పసెట్టి
దండనాయకుల నుద్దండుఁ డన్న యశస్సు
నందిన కాతుమొఱ్ఱమమగండు
పురముతిమ్మనీఁడు భుజబలరాయండు
ప్రముఖు లెల్ల పూర్వవైర మొంచి
యాచమేంద్రు విడిచి యాత్మబలాలతో
వెడలి రాణిసేన విడిసినారు.

తానున్ యాచమనాయఁడయ్యదనుఁగన్ దారాపథమ్మంటి రా
న్నేనిన్ భంగుల రంగరాయవధ నింత్రింటన్ విచారాంబుధుల్
మేనుల్ దాల్చెడిరీతిఁ జాటి జగమున్ ద్రిప్పెన్యథార్థార్థమున్
సానుక్రోశముగా నెఱింగి జనపతుల్మెన్న విజృంభింపఁగన్.

రామవిగ్రహపూజ రామనామజపంబుఁ
జేసి శ్రీవైష్ణవాశీస్సు లంది
జయగరుడాద్రిపూజాఘంటికలు మ్రోయ
రామభద్రగజాధిరాజ మెక్కి
ధీరుఁడై గోవిందదీక్షితసచివోత్త
ములు మదేభముపైని గొలిచి రాఁగ
రాజులు మన్నీలు రౌతులు దొరలు వా
జులపైని బ్రక్కల బలిసి రాఁగఁ
గాల్బలము ముందుఁ బుడమిఁ గ్రక్కదిపి నడువ
శ్రీమహాచోళపురసార్వభౌమబిరుద
రాజితుండగు రఘునాథరాయవిభుఁడు
కదలె యాచమజయరమాసదనుఁ డగుచు.

ఉత్తరమల్లూరియొద్ద నడ్డము రాఁగ
దావలుపాపని దఱిమి కొట్టి
తిరుమలలోఁ బొంచి యుద్ధవడిఁ జూపిన
మన్నెరాజుల నెల్ల మట్టుపెట్టి

చెంగలుపట్టునఁ బొంగి యెదిర్చిన
రాచసర్దారులఁ గీచమణఁచి
పాలెంబుకోటకెల్లపట వేచి పైఁబడ్డ
యతిరాజు నాజిలో హతముచేసి
తనకు నెదు రేగుదెంచు విస్తారబలుఁడు
ఘనుఁడు రఘునాథరాయని గలిసికొనఁగఁ
జేరెఁ గావేరితీర 'త్రోపూరు'గ్రాము
పరిసరమ్మును యాచమప్రభుఁడు నాఁడు.

కావేరీతీరమె యు
ద్ధావనిగా మాఱిపోయినది త్రోపూరే
జీవన్మైనది యని కి
ర్త్యావులు సరి పంచుకొనియె రక్తాక్షిగలన్.

యాగీమైనది రాణి ధ
రాగురుతర రాజ్యవిభవలక్ష్మికయి దురు
ద్యోగినియై రంగ్రాయని
లోఁగొని వధియించె నంచు లోకములోనన్.

జగతినానుభూతి సంపూర్ణముగఁ గాని
పటుత యాచవిభుఁడు పౌజుఁ దీర్చి
నాత్మపశుబలమ్ము నాధారముగఁ గాని
కాలు దువ్వె రాణి కలని కెక్కె.

లెక్కఁగట్ట వీలు లేనంత సైన్యమ్ము
పిక్కటిల్లె రాణిప్రక్కఁ నిలిచి
వేళ్ళమీఁద నెంచ వీలైన బలగమ్ము
యాచవిభునిమాపు గాచియుండె.

మాదినీనికడిందిమగఁటిమి కెదురుగాఁ
చెన్నప్పనాయుండు చెలఁగినిలిచె
మాకరాజుపసందుమగసిరిముందుగా
నయ్యసవిభుఁడు సయ్యాటలాడె
వెంకు టక్కరియెత్తు వేయుటె తడవుఁగా
వేంగళవిభుఁడు కవ్వించి దూఁకె
దళవాయిచెంచు ముండలకు మ్రొగ్గినవెంట
నరసింగపతికంటి కెఱుపు దోఁచె

జగ్గరాజు పట్టపగ్గాలు లేకుండఁ
బరవిడించి ముందు కురవడింప
యాచమప్రభుం డయాచితపౌరుష
జ్వాలతోడఁ జేతివాలు ద్రిప్పె.

తోడరి బారియిడక తుండీరవిభుఁడు తా
నెంత యడ్డుకొన్న నిట్టె గెలిచి
కడఁగి మధురవిభుఁడు కావేరివంతెన
నెంత చెఱుపుచున్న నిట్టె దాటి.

తంజాపురభర్త ధను
శ్శింజారిపుగర్వహర్త సేనను దా ఘుం
దండై వడిఁ దెచ్చుచునుం
డం జతురత రాణి తెలిసి డాసె నెదురుగన్.

కటుశిరస్త్రాణమ్ము కమనీయనీలకుం
        తలదీర్ఘవేణి కన్పడక తాల్చి
పటుతనుత్రాణమ్ము బహురమ్యావక్షోజ
        యుగసమున్నతి క్రుంగుపగిదిఁ దాల్చి
భయదదీర్ఘకరాసి పాణిపల్లవరాగ
        మృదులకాంతులు దోఁపనీక దాల్చి
ఘనకఠోరగ్రంథి కాసెకోకను గట్టి
        తటభార మణఁగుచందానఁ దాల్చి
మేలినిగనిగజిగివెల్గు డాలు పూని
చాల పొడవైన యొఱ దట్టిఁ వ్రేలవైచి
యచ్చముగ యోధమూర్తియే యనఁగ రాణి
ధవళతురగముపైనుండి దారిసడ్డె.

అతఁడు రఘుప్రవీరుతుల యాననఁ జిక్కనికీర్తిఁ గాంచి త
ద్గతి నెదిరించు కాంతపయిఁ దారసిలెన్ రఘునాథమేదినీ
పతి, యది కీర్తికిన్ గొదువ పట్టుసు, రామవరుండు తాటకన్
వతిగ నెఱింగి చంపె, రఘునాథుఁ డెఱుంగక పోరె నీమెతో.

కాతరమైనదో, యదియొకానొకయెత్తో, మతేమొ, రాణి తా
భీతిఁ దూలంగినట్లు పరువెత్తె వెసన్; తమ రెండుసైన్యముల్
చేతులు చేతులుం గలుప శ్రీరఘునాథుఁడు యాచమేంద్రుడున్
బ్రీతి భజించినా రుభయవీచులఁ గూడిన వార్ధులట్టులన్.

ఎటు గనుఁగొన్న సేన లెమరెత్తుట యొత్తుట, రక్తపూరముల్
జోటజోటఁ బాఱు టాఱుట, వసుంధర పంకకళంకయౌట, కం
కట కటకారవమ్ములు, టకాటకి స్రోగెడి కత్తిమ్రోఁతలున్,
గుటగుటలాడు ప్రాణులు, కకుప్పుల రేగిన రేణు లయ్యెనిన్.

ఘనజవోత్సాహుఁడై తనసేన కర్ధచం
ద్రాకృతివ్యూహ మేర్పాటుచేసి
చివగడల్ కైదువుల్ సెలకట్టె సెలఁగోల
సెలఁగత్తి గల దండు నిలిపి మొనల
దుమ్ములు మేలిదోదుమ్ము లీటెలు విండ్లు
గల పటాలము ప్రక్కఁ గాపువెట్టి
మరతుపాకులు మహాగుసుశతఘ్నులు ప్రయో
గించు దిట్టల ముందుఁ గీలుకొలిపి
రథగజతురంగబలము సుప్రథితరీతి
వెనుకఁ గాపుంచి రఘునాథవిభుఁడు పోరెఁ
బూర్వపశ్చిమవార్ధు లుప్పొంగి నాఁడు
కలిసినట్టుల నుభయసేనలకు సమము.

మడిసెను మాదినీఁడు, రణమారణమయ్యెను మాకవీరుఁ, డె
త్తుడిగెను వెంకు, వీరమృతినొందెను శ్రీదళవాయిచెంచుఁ, తె
ల్లడరుచు జగ్గదుం తొలకటి యాచము వైచెను, గాని యాతఁ డ
చెడుగుతలన్ నభోభువనసీమలఁ గందుకకేళి సల్పె వే.

జగ్గవిభుని సేన నుగ్గునుగ్గై పోవె
రాణిభయదఘూర్ణమానసయన
వహ్నిగోళయుగళి వఱదఁగట్టె ననూయ
వేగ రామదేవు వెదుక సాగె.

భీతవిభీతగా ననికి వేఱయి పోయిన రాణి తాను ని
ర్భీతిగ యాచమేంద్రుమొగ వ్రేలె భయంకరకాళికాకృతిన్
శ్వేతతురంగమున్ గళను వేయుచుఁ బొంగుచు రంగరాట్కు-
జ్యోతిని జిన్నిదీపమును నుఫ్ఫున నార్పఁ గరాళఖడ్గయై.

రాణివాలకమ్ము రఘునాథరాయండు
చిటికెలోనఁ దెలిసి చేయివీచె,
యాచమప్రభుండు హడలి యేగెడిలోన
రామదేవవిభుని రాణి డాసె.

కొఱకొఱలాడుచున్ ఛురిక గ్రువ్వఁ గరమ్మును నెత్తు నంతలో
గఱకతిఁ దిర్మలేంద్రరజకాకృతి యొక్కటి యడ్డువచ్చి యా
చిఱుతని గర్భమం దిముడఁ జేరిచి సందిడ కాత్మకంఠమున్
ఛురికకు దానమిచ్చె దయఁజూపుము నీ పగ దీరెఁ దల్లిరో!

అనుచు నవని కొఱగి యతి దైన్యబాష్పాంబు
రాశితోడఁ జూచె రాణివంక,
'తల్లి' యన్న నుడికిఁ దత్తిరిల్లి యెరింగెఁ
దాని పెంచి యున్న తల్లి యగుట.

'దేవు డెంత చేటు దెచ్చెనురా బాబు !
నీ' కటన్న జాలివాక్కొకండు
నాఁడు వెడలె నామెనయగారినోటను
మఱచె రామదేవుమాట యపుడు.

'బిడ్డకంఠమందు బెడిదంపుటసి దిగ
నయ్యొ !' యంచు వచ్చి యాచముండు
తిరుమలేంద్రుగళముచ్ఛురికను లాగెడు
రాణివెన్ను దిగఁ గృపాణిఁ గ్రుమ్మె.

వీపునపోటుతో, వెనుకవీరుని, మోము మలంచి చూచె ర
క్తాపగ నుండి రాణి, కనకాబ్జసమానముఖానఁ జింతయే
తోఁపదు, కాంతి మాయదు, యథోచితధీరగభీరభావముల్
లోపముగా, వీఁకామె తనలోమఱి యేమి తలంచుకొన్నదో.

పకపకా నగి పల్కె "భక్తుఁడా! యాచమా!
నీ భక్తి కలరితి, నెగ్గి తీవు,
జయపరాజయములు స్వాయత్తములు కావ?
దైవమ్ముపైనె యాధారపడున?